# అమరుడు బాపూజీ

దేవులపల్లి ప్రభాకరరావు








# అమరుడు బాపూజీ

దేవులపల్లి ప్రభాకరరావు
అధ్యక్షులు : తెలంగాణ అధికార భాషా సంఘం



యువభారతి ప్రచురణ
తెలంగాణ సారస్వతపరిషత్ భవనాలు,
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001

AMARUDU BAPUJI
by DEVULA PALLI PRABHAKARA RAO

# అమరుడు బాపూజీ

(మహాత్మాగాంధీ 150వ జయంతిని పురస్కరించుకుని ప్రత్యేక రచన)

రచయిత : దేవులపల్లి ప్రభాకరరావు
అధ్యక్షులు : తెలంగాణ అధికార భాషా సంఘం



యువభారతి ప్రచురణ : 191

తొలి ముద్రణ : 2019 అక్టోబర్ 2

కాపీలు : 1000

ముఖచిత్ర రూపకల్పన : సతీష్

వెల : 50/-

ప్రతులకు :



యువభారతి
తెలంగాణ సారస్వతపరిషత్తు భవనాలు,
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001

ముద్రణ :
సతీష్ గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్, 8885144422

# మహాత్మునికి నివాళి

హితంతో కూడుకొన్నది సాహిత్యం. మానవ మూల్యాలను నిలబెట్టుతూ, మనుష్యులలో మంచితనాన్ని పెంపొందించడంలో సాహిత్యం పాత్ర ప్రముఖమైనదని "యువభారతి" ఆది నుండి విశ్వసిస్తున్నది. ఆ విశ్వాసంతోనే తొలినుండి అనేక సమాజోపయుక్తమైన సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ, చక్కని సాహిత్య గ్రంథాలను వెలువరిస్తూ ఉన్న విషయం సహృదయులకు విదితమే!

2019–జాతిపిత మహాత్మ గాంధీ 150వ జయత్యుత్సవ సంవత్సరం. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని మా యువభారతి సంస్థ – మాన్యులు, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు డా.కె.వి. రమణాచారి గారి ప్రోత్సాహంతో విశిష్టమైన పలు కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. ముందుగా మా ప్రధాన సంపాదకులు శ్రీ సుధామ గారి కూర్పుతో గాంధీ గారి 150 సూక్తులను గ్రంథంగా ప్రచురించడం జరిగింది. మా సంస్థ వ్యవస్థాపకులు ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి సంకల్పం, డా. రమణాచారి గారి కొండంత ఆశీస్సులతో లక్ష ప్రతులను ఇప్పటికే ప్రచురించి ప్రజా బాహుళ్యానికి పంపిణీ చేయడం జరుగుతున్నది. రెండవ కార్యక్రమంగా గాంధీతత్త్వ ప్రచార లక్ష్యంగా ఒక కవి సమ్మేళనాన్ని నిర్వహించి, ఆయా కవుల కవితలను "గాంధీ సందేశ పథం" పేరిట గ్రంథంగా ప్రచురించి ఆవిష్కరింపజేసాం. అట్లాగే మూడవ కార్యక్రమంగా కళాశాలల విద్యార్థినీ విద్యార్థులకు గాంధీ మహాత్ముని సూక్తులపై వక్తృత్వ పోటీలను నిర్వహించి, విజేతలకు బహుమతులను ప్రదానం చేయడం జరిగింది. ఈ కార్యక్రమాల నిర్వహణలో తెలంగాణ భాషా సాంస్కృతిక సంస్థ, ముఖ్యంగా ఆ సంస్థ సంచాలకులు శ్రీ మామిడి హరికృష్ణ గారు అందించిన సహకారనికి యువభారతి ధన్యవాదాలను తెలియజేస్తున్నది. ఇక నాలుగవ కార్యక్రమంగా మహాత్ముని జీవన ఔన్నత్యాన్ని, పరమార్థాన్ని వివరించే ప్రసంగ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసి, ఆ ప్రసంగ పాఠాన్ని ఈ గ్రంథ రూపంలో పాఠకులకు అందిస్తున్నాం. ప్రఖ్యాత పత్రికా రచయిత, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ దేవులపల్లి ప్రభాకరరావు గారిచే విరచితమైన ఈ "అమరుడు బాపూజీ" గ్రంథంలో శాంతి మార్గం, సత్యాన్వేషణ, అహింసాయుత సత్యాగ్రహోద్యమాలు, నైతిక మూల్యాలతో కూడిన గాంధీజీ విశిష్ట జీవన సందేశం గురించి వివరించబడింది.

ఈ గ్రంథం యువతకు సమభావం, సదాశయం, సజ్జీవనం పట్ల స్ఫూర్తిని కలిగిస్తుందని ఆశిస్తున్నాం. యువతరం ఆ సన్మార్గంలో ప్రస్థానించి, మన దేశ భవితవ్యాన్ని తీర్చిదిద్దడమే ఆ మహాత్మునికి నిజమైన నివాళిగా భావిస్తున్నాం.

**డా. ఆచార్య ఫణీంద్ర**

**అధ్యక్షులు , "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ**

# మన మహాత్ముడు

“భారత స్వాతంత్ర్య జ్యోతి
వెలిగించిన నీ శక్తి
దిశలు దాటి ప్రసరించెను
జోహారంది ఈ జగతి
జై గాంధి – మా గాంధి
మము వీడునె నీ జ్యోతి....”

అని కవులచే కీర్తించబడిన మన మహాత్ముడు మోహనదాస్ కరమ్‌చంద్ గాంధీ నూటయాభయ్యవ జన్మోత్సవ సందర్భం ఇది. గాంధీ ఆదర్శాలు, ఆశయాలూ నేటికీ – భారతదేశానికే కాదు, విశ్వవ్యాప్తంగా దారిదీపాలు. ఈ తరానికి మన మహాత్ముని జీవనసరళినీ, సందేశాన్నీ అందించవలసిన బాధ్యతగా యువభారతి ఈ గ్రంథప్రచురణకు సమకట్టింది. తెలంగాణ అధికారభాషా సంఘ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి ప్రభాకరరావు గారు “అమరుడు బాపూజీ’ అనే ఈ గ్రంథాన్ని మా కోరికమేరకు రచించి ఇచ్చారు. ప్రభాకరరావు గారు అన్నట్లుగానే – “రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అంతర్జాతీయ రంగంలో వైషమ్యాలు పెంచుకున్న వారు సైతం అత్యాధునిక అణ్వస్త్ర సంపదను, భయంకర మారణాయుధాలను సంతరింపచేసుకున్న వాటివల్ల ప్రయోజనం శూన్యం అని తెలుసుకుని సకల సమస్యల పరిష్కారానికి గాంధీజీ శాంతి మార్గమే శ్రేయమని, శరణ్యమని గ్రహిస్తున్నారు. అన్ని దేశాలలో అన్ని వర్గాల ప్రజల అభ్యున్నతికి, కోట్లాది ప్రజల సమస్యల శాశ్వత పరిష్కారానికి, సమున్నతికి గాంధీజీ మార్గమే తారకమంత్రం అన్న జ్ఞానోదయం స్పష్టంగా కన్పిస్తున్నది.”

ప్రభాకరరావు గారు ఈ పుస్తకంలో మహాత్ముని సమగ్ర జీవిత విశేషాలను, గాంధీజీకి కవుల అక్షర నివాళిని సంతరించారు. ప్రభావోపేతమైన గాంధీజీ క్విట్ ఇండియా ఆంగ్ల ప్రసంగాన్ని తమ రచనలో యథాతథంగా నమోదు చేశారు. గ్రంథాంతంలో గాంధీజీ నిరహార దీక్షలు, గాంధీ అరెస్టులు,

కారాగారశిక్షలు, గాంధీ మహాత్ముని జీవితంలో ఘనఘట్టాలు కాలక్రమ పద్ధతిలో కూర్చుడం వివిధ పోటీ పరీక్షల విద్యార్థులుగా యువతకు ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది.

త్రేతాయుగంలో శ్రీరాముడు, ద్వాపరయుగంలో శ్రీ కృష్ణుడు తరువాత భారత చరిత్రలో చెప్పవలసింది గాంధీయుగమే అంటారు రచయిత. గాంధీజీని భగవంతునిగా భావించేవారు ఆ రోజుల్లోనే కాదు నేటికీ ఉన్నారు. అందుకు ప్రబలతార్కాణం తెలంగాణ రాష్ట్రంలోని నల్లగొండ జిల్లా పెదకాపర్తిలో సెప్టెంబర్ 2014 లో నిర్మింపబడి నేటికీ అనేకమంది భక్తుల సందర్శనతో విరాజిల్లుతున్న గాంధీదేవాలయమే ! ఈ 'గాంధీగుడి'నొకదానిని విజయవాడ ఆంధ్రప్రదేశ్‌లో కూడా స్వాతంత్ర్య సమరయోధులు రాంపిల్ల సయ్యద్ అప్పలస్వామి, గోళ్ళ నారాయణరావు గార్ల మనుమలు గాంధీ తత్త్వాన్నీ, విలువలనూ ప్రచారం చేసే నిమిత్తం నిర్మించారు.

గాంధీజీ నిరాడంబర జీవితానికీ, మాతృభక్తికీ, నిక్కచ్చియైన ఆదాయవ్యయాల లెక్కలకూ, సత్యాగ్రహమనే ఆయుధ విజ్ఞానానికీ, సత్యవాక్కుకీ, ఎంతటి ప్రాధాన్యం ఇచ్చారో ఈ రచనలో ప్రభాకరరావుగారు వివరించారు. గాంధీ ప్రతిమాట, ప్రతిరాత శక్తిమంతమంత్రాక్షరాలయినాయి అని పేర్కొన్నారు. ఒక గొప్ప పాఠకునిగా, రచయితగా గాంధీజీ విశేషజ్ఞతలను ఉల్లేఖించారు. ఈ అంశాలన్నీ వ్యక్తిత్వవికాసాభిలాషులయిన నేటి యువతకు ఎంతో ప్రయోజనదాయకాలు.

కోదండమె చేతి కర్ర
సుదర్శనము రాట్నమేను
నిరసన సత్యాగ్రహాది
నిరుపమాన బలములతో
నిలచినావు గెలిచినావు
ఎంత ధీరమూర్తివోయి గాంధీజీ

అని అలనాటి కవివతంసులు కీ॥శే. అల్లంరాజు వెంకటసుబ్బారావు గారు కీర్తించినట్లుగా మహాత్ముని ధీరత శాశ్వత స్ఫూర్తిమంతం. అలాగే 'సేవద్వారానే

భగవంతుని చేరుకోగలం కాబట్టి సేవే నా మతం' అన్నారు గాంధీజీ. అంతేకాదు "సత్యం – దేవుడు వేరు వేరు కాదు. సత్యమే దేవుడు" అని ప్రబోధించారు.

ఏమయినా అమరుడు బాపూజీ జీవితం నేర్పించే పదిపాఠాలు యువత ఎల్లపుడూ ఔదలదాల్చదగినవి. అవి –

* వస్తు వ్యామోహంతో పరుగులు పెట్టవద్దు
* మానసిక ఒత్తిడికి గురికావద్దు
* స్పష్టమైన ఆలోచనలను కలిగివుండు
* మీరు చేయగలిగిన దానినే చెప్పండి
* ఎప్పుడూ సరియైన పనులనే చేయండి
* అర్థం కాని దానిని అడగండి
* మీ'లో' ప్రశాంతను వెదుక్కోండి
* ఈ రోజున జీవించండి
* క్షమించడం నేర్చుకోండి
* మార్పుకు – ముందు మీరు మారండి

గాంధీజీ జన్మదినమైన అక్టోబర్ 2 న ఐక్యరాజ్యసమితి 'ప్రపంచ అహింసాదినం'గా ప్రకటించడం మనకు గర్వకారణం, ఉత్తేజదాయకం. యువభారతి మహాత్మగాంధీ 150వ జయంత్యోత్సవ సందర్భంగా ప్రచురిస్తున్న ఈ 'అమరుడు బాపూజీ' గ్రంథం పాఠకజన సమాదరణ పాత్రం కాగలదని విశ్వసిస్తూ

సదా మీ

**సుధామ**

ప్రధాన సంపాదకులు

యువభారతి ప్రచురణలు

**(98492 97958)**

హైదరాబాద్

**06.09.2019**

# అమరుడు బాపూజీ

భారత జాతిపిత, స్వాతంత్ర్య ప్రదాత, భారత ప్రజల ప్రియతమనేత గాంధీజీ. బాపూజీగా ఆయన ప్రపంచ ప్రసిద్ధుడు. నూటాయాభయి సంవత్సరాల కిందట జన్మించారు. విద్యార్థి దశ నుంచి లెక్కిస్తే ఆయనది డెబ్బయి మూడు సంవత్సరాల క్రియాశీల, విశ్రాంత రహిత జీవితం. మనిషి మనిషిగా బతుకడానికి, తలఎత్తి నిలువడానికి దక్షిణాఫ్రికాలో ఇరవయి ఒక్క సంవత్సరాలు, స్వదేశం భారతదేశంలో ముప్పయి మూడు సంవత్సరాలు, మొత్తం యాభయి నాలుగు సంవత్సరాలు సత్యం, అహింసల శాంతియుత సంగ్రామం నిర్వహించారు గాంధీజీ. మానవ చరిత్రలో సాటిలేని సంగ్రామం అది. ఇప్పటికి డెబ్బయి ఒక్క సంవత్సరాల కిందట ఢిల్లీలో దైనందిన ప్రార్థనా సమావేశానికి అప్పటికే ఆసల్యం అయిందని హడావుడిగ రాగానె గాంధీజీ ఒక మతోన్మాది పిస్టల్ బుల్లెట్లకు గురయి మృతి చెందారు. ఏ మతోన్మాదానికి వ్యతిరేకంగా ఆయన ఒక మిషన్ గా, అకుంఠిత దీక్షతో పోరాడినారో ఆ మతోన్మాదమే బుసలు కొట్టి ఆయన ప్రాణాన్ని హరించింది. మతోన్మాద శక్తులు భావించినట్లు నిజానికి గాంధీజీ మరణించలేదు–శారీరకంగా ఆయన మన మధ్య లేకపోయినా సైద్ధాంతికంగా గాంధీజీ స్వదేశంలోనె కాదు విదేశాలలో గూడ, ప్రపంచమంతటా జీవిస్తున్నారు. ఆయన తాడిత, పీడిత జనావళికి ఒక అదృశ్య, అద్భుతశక్తిగా ముక్తి మార్గం, ప్రగతిపథం చూపిస్తున్నారు. రెండవ ప్రపంచ యుద్ధంలో గెలిచినవారు, ఓడినవారు ఇక యుద్ధాల వల్ల లాభం లేదని, సాధించగలిగింది ఏమీలేదని గ్రహించి, గుర్తించి గాంధీజీ చూపిన మార్గంలో నడుస్తూ సామరస్యం కోసం తహతహలాడుతున్నారు. అంతేకాదు–రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అంతర్జాతీయ రంగంలో వైషమ్యాలు పెంచుకున్న వారు సైతం అత్యాధునిక అణ్వస్త్రసంపదను, భయంకర మారణాయుధాలను సంతరింపజేసుకున్నా వాటి వల్ల ప్రయోజనం శూన్యం అని తెలుసుకుని సకల సమస్యల పరిష్కారానికి గాంధీజీ శాంతి మార్గమే శ్రేయమని, శరణ్యమని గ్రహిస్తున్నారు. అన్ని దేశాలలో అన్ని వర్గాల ప్రజల అభ్యున్నతికి, కోట్లాది ప్రజల సమస్యల శాశ్వత పరిష్కారానికి, సమున్నతికి గాంధీజీ మార్గమే తారకమంత్రం

అన్న జ్ఞానోదయం స్పష్టంగా కన్పిస్తున్నది. హింసకు పరిణామం, ప్రతిఫలం హింసే అని గాంధేయ ప్రభావంతో ఆధునిక మానవుడు గ్రహిస్తున్నాడు. ఇది కేవలం ఆశావాదం కాదు, అక్షర సత్యం, ఈనాటి వాస్తవం. అందువల్ల 'బాపూజీ బతికే ఉంటడు'. ఆచంద్రతారార్కం ఆయన సిద్ధాంతాలు జీవించి ఉంటాయి, ప్రగతి పథానికి కరదీపికలవుతాయి.

## అక్షర నివాళి

గాంధీజీ గురించి మాట్లాడడం, రాయడం ఎంత సులభమో అంత కష్టం–ఆధునిక ప్రపంచ మహాపురుషులలో, మహనీయులలో, మార్గదర్శకులలో ఆయన అగ్రగణ్యుడు గనుక. ఆయన జీవితకాలంలో, ఆ తరువాత, భారత స్వాతంత్ర్య ఉద్యమం రోజుల్లో ప్రపంచమంతట వివిధ భాషలలో గాంధీజీకి అక్షర నివాళి అర్పించినవారు అనేకులు. స్వాతంత్ర్యసమరంలో, విముక్తి ఉద్యమంలో స్వయంగా భాగస్వామి అయిన మహాకవి దాశరథి–

"...జండా ఒక్కటె మూడువన్నెలది
దేశంబొక్కటే భారతాఖండాసేతుహిమాచలోర్వర
కవీట్కాండమ్ములోనన్ రవీంద్రుండొక్కడె కవీంద్రుడు
ఊర్జిత జగద్యుద్ధాలలో శాంతి కోదండోద్యద్విజయుడు
గాంధీ ఒక్కడే, తల్లీ మహాభారతీ!..." అని అన్నారు.

గాంధీజీ వ్యక్తిత్వ ప్రభావం, గాంధీ సిద్ధాంతాల ప్రభావం ప్రసరించని కవులు, రచయితలు, మేధావులు లేరంటే అతిశయోక్తి కాదు. ప్రపంచమంతట కవులు, రచయితలు, పాత్రికేయులు, మేధావుల మీద గాంధీజీ ప్రభావం వివిధ రూపాలలో చాల స్పష్టంగా కన్పించింది. సత్యాగ్రహ కార్యక్రమాల సందర్భాన భారతదేశం వచ్చి, కొన్ని రోజులు గాంధీజీ వెంట నడుస్తూ లూయిస్ ఫిషర్, విన్సెంట్ షేన్, జాన్ గంధర్ వంటి ప్రపంచ ప్రఖ్యాత రచయితలు తమ అనుభవాలను వివరిస్తూ గాంధీజీ జీవిత చరిత్రలు రాసారు. అంతకుముందే ఫ్రెంచి ఫిలాసఫర్ రోమరోలా గాంధీజీ జీవితచరిత్ర రాసారు.

దేవులపల్లి రామానుజరావు ప్రసిద్ధ సాహిత్యవేత్త, కవి, రచయిత, జాతీయవాది. ఆయన నాగపూర్ లో విద్యార్థిగా ఉన్నప్పుడు 1942లో వార్ధా వెళ్లి గాంధీజీ ఆశ్రమంలో గాంధీజీ దర్శనం చేసుకున్నారు. గాంధీజీ ఒక రుషివలె ఉన్నాడని, ఆయన ఆశ్రమం రుష్యాశ్రమం వలె ఉందని రామానుజరావు తమ జ్ఞాపకాల గ్రంథంలో రాసారు. రామానుజరావు ఆ తరువాత గాంధీజీపై రాసిన పద్యాలు ఇవి-

" హస్తమున దాల్చి యా అహింసాయుధంబు
శాంతి సంగ్రామ నాదము సలిపినంత
ధరణి కంపించె నల సభ్యతా జగంబు
సన్నిహిత ప్రలాపముల్ చాలచేసె

ఎండకన్నెరుగాని యిందీవరాక్షులు
కాసెలు బిగియించికదలినారు
విజ్ఞానజగతిని విహరించుపండితు
లర్పింపనున్న వారాత్మశక్తి
కూలినాలియొనర్చి కుడుచు పెంబీదలు
నీ గొడుగు ఛాయలనిల్చినారు
సిరితోడ దులదూగు శ్రీమంతులెందరో
త్యాగ సంసిద్ధులయి తరలినారు
వేణుగోపాల గానము విన్న గోపి
కల విధమ్మున మేనులు పులకరింప
అరుగు దెంచిరి ప్రజలు నిన్ననుసరింప
కలడు దేవుడు మన యందు కలడుకలడు...

"నీ ఆరాటం ఆసాంతం మానవకల్యాణానికి" అంటూ గాంధీజీకి ప్రజాకవి కాళోజీ నీరాజనం అర్పించారు.

విధానాలు, వైఖరులు వేరయినప్పటికి మహాకవి శ్రీశ్రీకి గాంధీజీ జ్ఞాపకం వచ్చాడు. ఆయన అంటారు-

"జ్ఞాపకం వస్తున్నావు
గాంధీజీ ఈనాడు నీవు
మర్మాంతికవహ్నిజ్వాలా
మహోగ్ర దుస్సహ తాపాల
జ్ఞాపకం వస్తున్నావు
గాంధీజీ ఈనాడునీవు...
ఇప్పుడు చెప్పు ప్రియ గాంధీజీ
ఎక్కడుందినీవాశించిన
సంక్రందన ధామం
ఎంతదూరం ఆశాంతసౌమ్యసువర్ణ
సంక్రందన నందననగరం...
మారువేషాల మారీచగణాలం మేము
మాటిమాటికీ నిన్ను చంపేస్తున్నాం
యుగయుగాలుగా సత్యాన్ని
హత్య చేస్తున్నాము
ఎందువల్లనంటే అసత్యంఒకటే
మా ఆసరా కాబట్టి...

గాంధీజీని ప్రశ్నించిన విప్లవ కవి శ్రీశ్రీ సైతం గాంధీజీని ప్రస్తుతించకుండా ఉండలేక పోయాడు. శ్రీశ్రీ మాటల్లోనె–

"ఓ మహాత్మా!ఓ మహర్షీ
ఓ క్షమా పీయూషవర్షీ
ఓ తపస్వీ ఓయశస్వీ
ఓ అహింసాశయ మనస్వీ"... మహాత్ముడు శ్రీశ్రీకి మహర్షిగా కన్పించారు. శ్రీశ్రీ సమకాలికుడయిన మరో మహాకవి, మధుర మృదుల కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రకటించిన ప్రగాఢ విశ్వాసాన్ని ఆయన మాటల్లోనె చూడండి–

"మన హిమాలయాలు మనగంగలు పొలాలు
మనస్థలాలు పూలవనులు గనులు
మన అఖండభూతి మనజాతి మననీతి
ఉన్నవరకు గాంధీజీ ఉండితీరు!

మొదట శిరమునెత్తి, పిదప ఛాతి విప్పి
కంట వెలుగు నింపి కంఠమెత్తి
మానవుడనంగ మాగాంధియే యంచు
గర్వపడుచు చాటగలను నేను!

నాశిరస్సు శీతనగమంత ఎగద్రోసి,
నానరాల జీవనదులు పోసి,
నన్ను మానవునిగ నన్ను భారతునిగ
సలిపినాడు పరువు నిలిపినాడు!

సగము బట్టలేని సామాన్యుడు ఫకీరు
తాతయొకడు లోకధాతయయ్యె
ఏ మహత్తులోన నిమిడించుకొన
ఈయుగాన చిత్రమీజగాన

ఎల్లయెల్లలు కరగగా, ఎల్లకల్ల
లల్లనల్లన సురుగగా, ఎల్లజనులు
చల్లని కుటుంబమయి మనజాలువరకు
మా మహాత్ముడు మా గాంధీయనియెతీరు..."

'కమ్మగా బతికితే గాంధీయుగం' అని గూడ కృష్ణశాస్త్రి అన్నారు. తెలుగు నేల అంతట గాంధీజీ పాద ధూళి పరిమళించింది. గాంధీజీ అడుగుపెట్టిన ప్రతి అంగుళం ఆయన మంగళాశాసనాలతో ప్రతిధ్వనించింది-పసిబిడ్డలు, పండువృద్ధులు, బాలింతలు, కన్నతల్లులు, చేమంతులవంటి ఇంతులు,

బాలబాలికలు, యువతీ యువకులు, తల్లిదండ్రులు, అన్నివర్గాల వారు, కోట్లాది జనులు గాంధీ బోధనలతో, పిలుపుతో ఉత్తేజితులయి స్వాతంత్ర్య సమరంలో అంతులేని త్యాగాలకు కంకణధారణ చేసినారు. మహాత్ముడు వరంగల్లు జిల్లా మానుకోట స్టేషన్లో కొన్ని నిమిషాలు ఆగి పవిత్రదర్శన భాగ్యం కల్గించినప్పుడు ఆ స్టేషన్‌లో డ్యూటీలో ఉన్న ఒక పోలీసు అధికారి ఇంటికి వెళ్లగానె ఒక శుభవార్త తెలిసింది ఆయనకు ఆరోజే కొడుకు పుట్టాడని. ఆ తండ్రి, ఒక పోలీసు అధికారి, తన బిడ్డకు షోయిబుల్లాఖాన్ అని పేరు పెట్టాడు. షోయిబ్ పెరిగి పెద్దవాడయి, ఒక ఉర్దూ పత్రిక సంపాదకుడయి హైదరాబాద్ నగరంలో మతోన్మాదులకు వ్యతిరేకంగా తనకలాన్ని బలమయిన ఆయుధంగా ఉపయోగించారు. ఆ యువ సంపాదకుడు, రచయిత, దేశభక్తుడు మతోన్మాదుల ఆగ్రహానికి గురి అయి ప్రాణాలు కోల్పోయాడు.

ఆరోజుల్లో తెలుగు సీమ అంతటా, ప్రతి ఇంట, ప్రతి నోట ప్రతిధ్వనించిన ఈ గీతం బసవరాజు అప్పారావు కలంనుంచి పొంగి వచ్చింది–

“కొల్లాయి గట్టితేనేమి మా గాంధి
కోమటయి పుట్టితేనేమి
వెన్నపూస మనసు
కన్నతల్లి ప్రేమ
పండంటిమోముపై బ్రహ్మతేజస్సు
నాల్గు పరకల పిలక
నాట్యమాడే పిలక
నాలుగు వేదాల నాణెమెరిగిన పిలక
బోసినోర్విప్పితె ముత్యాల తొలకరే
చిరునవ్వునవ్వితే వరహాల వర్షమె
చకచకనడిచితే జగతి కంపించేను
పలుకుపలికితే బ్రహ్మవాక్కేను...”

సమకాలిక తెలుగు కవులు, రచయితలు పండితులు, గాయకులు, కళాకారులు గాంధీజీచే అపారంగా ప్రభావితులయి ఆయనకు అక్షర సుమాంజలి అర్పించారు–

# కర్మయోగి

ఏమి మహిమంబు గలదో నీ నామ మందు
'బాపు' అను పేరు వీనుల బడిన యంత
నిలువునను నాదు మేనెల్ల పులకరించు
జల్లుమని నాదు హృదయంబు జలదరించు.

సర్వ సారస్వత ప్రపంచంబునందు
'గాంధి' యనియెడి వర్ణ యుగంబుతోడ
సాటి వచ్చెడు వేఱొక్క మాట గలదె
మార్దవంబున, మధురిమ, మంజులతను!

భువన 'మోహన' మైన నీ ముద్దు పేరు
రామ నామము కంటెను రమ్యమగుచు
భక్తి ముక్తి ప్రదంబయి భవ్యమైన
అవ్యయానంద సౌఖ్యంబు లందజేయు.

కర్మయోగివె యై నీవు గ్రాలుకతన
'కర్మ చంద్రుండు' అను పేరు కలిగె నీకు
దివ్య మహిమంబుతో నీవు తేజరిలుట,
తనరె నీకు "మహాత్ముడు" అనెడి బిరుదు.

-నాళము కృష్ణారావు

## సద్గుణకంధి

శుద్ధమై దేశమ్ము నుద్ధరించెడు నట్టి
ఖద్దరు బట్టనే కట్టుడనియె
గొట్లాటలకు దింపి గొంపల గూల్చెడు
మద్యపానమ్మును మానుడనియె
అస్పృశ్యతను వీడి యందఱతోడను
మిత్రభావముతోడ మెలగుడనియె
దౌర్జన్యరహితమౌ ధర్మమార్గము నందె
పడయ స్వరాజ్యమున్ గడగుడనియె

భారతీయుల జాతీయ భాషగాన
నందఱును హింది నేర్వంగ నర్హమనియె
సత్యమును న్యాయమును మీఱి చనకుడనియె
నఖిల సద్గుణకంధి మహాత్మగాంధి.

–ఆదిపూడి సోమనాధరావు

## అహింసకు ఆటపట్టు

ఎవ్వాని సత్కీర్తి యెల్లదిశలు నిండి
దివ్య దీధితులతో తేజరిల్లె
ఎవ్వాని జన్మచే నీ దివ్య ధాత్రికి
భూరి పుణ్యాత్మయన్ పేరుగలిగె
ఎవ్వాని వర్తన మెల్లదేశములందు
నాదర్శపాత్రమై యలరనయ్యె
ఎవ్వాని కృషిచేత నీ భారతాంబకు
పరదాస్య బంధముల్ బాసిపోయె

సత్యమెవ్వాని జీవిత సారమగును
అల నహింసకు నెవ్వాడు నాటపట్టు
అట్టి గాంధీమహాత్మున కంజలిడుదు
వర శతజయంతి యుత్సవ భవ్యవేళ. -కనుపర్తి వరలక్ష్మమ్మ

## మహాత్ముడు

నలువదికోట్ల తమ్ముల జీవితమ్ముల
కాయన మాట 'వేదాక్షరంబు'
భీరులనే కర్మవీరులఁ గావించు
ఆయన పిలుపు 'శంఖారవంబు'
సత్యంబు శాంత్యహింసలకు స్వాగతమిచ్చె
ఆయన బ్రతుకు 'మహా ప్రయాగ'
కొల్లాయితో పిచ్చిపుల్లాయి వలె నుండు
ఆయన దీక్ష 'లోకైక రక్ష'
అతఁ డొక 'పవిత్ర ధర్మ దేవాలయంబు'
అతఁ డొక 'విచిత్ర విశ్వవిద్యాలయంబు'
ఆ మహాశక్తి 'అంత యిం'తంచు తూఁ చఁ
జాల, మతఁ డొక పెద్ద 'హిమాలయంబు'. -కరుణశ్రీ

## మా గాంధీతాత

అడుగుపెట్టినచాలు అవనీంద్ర రత్న రం
జిత కిరీటములు హారతు లొసంగు!
బయలుదేఱినచాలు జయజయధ్వనులతో
గ్రామాలు గ్రామాలు కదలివచ్చు!
కొంగుబట్టినచాలు కోటానుకోట్ల హ
స్తములు బంగారు వర్షములు గురియు!
పెదవి యొకింత విప్పినచాలు లక్షల
కొలది తలల్ వచ్చి కొలువుతీర్చు!

నవ్వినంజాలు పతిత మానవ సమాజ
మానసమ్ములు దేదీప్యమానము లగు!!
పట్టుపట్టిన చాలు సమ్రాట్టులైన
తలలువంతురు మా గాంధితాత ముందు!!

-కరుణశ్రీ

'నిజమే'-గాంధీజీ ఇజమ్, 'జగమే'-గాంధీజీ గృహం. ఆయన సత్యాన్వేషణకు దర్పణం. ఆయన గుజరాతీలో, తన మాతృభాషలో రాసిన స్వీయచరిత్ర-THE STORY OF MY EXPERIMENTS WITH TRUTH. ప్రపంచ ప్రధాన భాషలన్నిటిలోకి గాంధీజీ ఆత్మకథను అనువదించారు. "I simply want to tell the story of my numerous experiments with truth, and as my life consists of nothing but these experiments... But they are spiritual or rather moral, for the essence of religion is morality... But for me, truth is the sovereign priniciple which includes numerous other principles..." సత్యాన్వేషణే పరమావధిగా గాంధీజీ తన సంపాదకత్వంలోని 'యంగ్ ఇండియా'లో రాసిన నాలుగు వ్యాసాలు బ్రిటిష్ పాలకులకు ఆగ్రహం కల్గించాయి-దేశద్రోహ నేరంగా ఆరోపించి బ్రిటిష్ ప్రభుత్వం ఆయన మీద కేసుపెట్టి 1922 మార్చిలో ఆరు సంవత్సరాల జైలు శిక్ష విధించింది. ఈ శిక్ష విధించిన గుజరాత్ హైకోర్టు ప్రధానన్యాయమూర్తి వ్యాఖ్య ఇది-"...Barring the trial of Socrates, there is perhaps no trial in the history of mankind comparable to that of Gandhiji which stimulated so much interest and whose influence on the life of humanity has been so profound...". కారాగార శిక్షలు, నిర్బంధాలు, ఆంక్షలు, నిరంకుశ చర్యలు గాంధీజీ సత్యవాణిని అడ్డుకోలేకపోయాయి.

యదా యదా హి ధర్మస్య
గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే !...

గీతాచార్యుని, భగవానుడి ఈ పలుకులు వినగానె ఆధునిక యుగంలో మొదట గాంధీ మహాత్ముడు(మోహన్ దాస్ కరమ్ చంద్ గాంధీ)జ్ఞాపకం రావడం సహజం. కేవలం భారత జాతికే కాదు, సకల మానవాళికి విముక్తిమార్గం చూపిన, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల మహదవకాశం కల్పించిన, మానవత మణిదీపాలు వెలిగించిన మహాపురుషుడు, మహనీయుడు, మానవోత్తముడు, మహాత్ముడు గాంధీజీ. ఆయన నిశ్చయంగా కారణజన్ముడు. కురుక్షేత్ర రణరంగంలో గీతాసారం ఆకళించుకుని అధర్మానికి వ్యతిరేకంగా గాండీవం ఎత్తిన నరుడే నేడు గాంధీ మహాత్ముడుగా అవతరించి ఉంటాడు. త్రేతాయుగం (శ్రీరాముడు), ద్వాపరయుగం(శ్రీకృష్ణుడు) తరువాత భారతచరిత్రలో చెప్పవలసింది గాంధీయుగమే. మానవాళి చరిత్రలో ఒక వినూత్న మహోన్నత యుగాన్ని సృష్టించినవాడు గాంధీ మహాత్ముడు. ఒక మనిషిని మరొక మనిషి జాతి వివక్షతతో, వర్ణ విభేదంతో, సాంస్కృతిక దురహంకారంతో దోచుకునే, కోట్లాది ప్రజలను దాస్యశృంఖలాలలో బంధించే సామ్రాజ్యవాదానికి, వలస పాలనకు అపూర్వ శాంతియుత, అహింసా విధానాలతో, సత్యాగ్రహ ఉద్యమాలతో చరమగీతం పాడిన స్వాతంత్ర్య ప్రదాత గాంధీ మహాత్ముడు. భారత ప్రజలకే కాదు, ప్రపంచమంతట వివిధ దేశాలలో, విశేషించి ఆసియా, ఆఫ్రికా ఖండాలలో కోట్లాది ప్రజలకు గాంధీ మహాత్ముడు శాంతియుత, శక్తివంత, హింసారహిత ఉద్యమస్ఫూర్తి కల్గించి, ఆ విశిష్ట ఉద్యమాలకు మార్గదర్శకత్వం, సారథ్యం వహించి బానిస బంధనాలను ఛేదించడానికి దోహదపడ్డాడు మానవత్వాన్ని ఆరాధించిన, మనిషి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పట్టాభిషేకం చేసిన మహాత్ముడు ఆయన. తన ప్రవచనాలను, సత్యం, అహింస బోధనలను, తన విశ్వాసాలను, తన సిద్ధాంతాలను అందరికంటె ముందు తానే ఆచరించిన, చెప్పిందే చేసిన, చేసిందే చెప్పిన కపట రహితుడు, కారుణ్యమూర్తి, అసాధారణ ఋషి పుంగవుడు గాంధీ మహాత్ముడు.

కనుకనే ఆయన మేరునగ సమాన ధీరత్వంతో, అచంచల ఆత్మవిశ్వాసంతో 'నా జీవితమే నా సందేశం' అని అనగలిగారు. ప్రతి కంటి నుంచి ప్రతి కన్నీటి బొట్టును తుడిచివేయాలన్నది తన ప్రగాఢ వాంఛ అని ఆయన ప్రపంచం ముందు ప్రకటించగలిగాడు. ఇంతటి ఒక మహనీయుడు ఈ ఆధునిక ప్రపంచంలో ఈ అవనిపై నడిచాడని రానున్న తరాలవాళ్లు నమ్మలేకపోతారని ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రవేత్త ఐన్ స్టీన్ అన్నారు. ఆయన అన్న మాటలు-"Generations to come, it may be, will scarce believe that such a one as this ever in flesh and blood walked upon this earth...".

## తల్లి ఒడిలో

ఒక మహాత్ముడుగా ఆయన ఆ దివి నుంచి ఈ భువికి దిగి రాలేదు. అతి సామాన్యుడిగా ఆయన జీవితయాత్ర ప్రారంభించాడు. భవిష్యత్తులో సకల మానవాళికి ఆశాజ్యోతిగా ఒక మహత్తర పాత్ర నిర్వహించవలసి ఉందన్న సంగతి ఆయనకు తెలియదు. అతి సామాన్యుడుగా, అత్యంత నిరాడంబరుడుగా, ఎటువంటి భేషజం లేకుండా మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ మానవాళికి విముక్తి కల్గించే, ముఖ్యంగా ఆనాటి, వంద సంవత్సరాల కిందటి ముప్పయి కోట్ల భారతీయులకు బ్రిటిష్ పాలన నుంచి విముక్తి కలిగించే మహోన్నత ఉద్యమంలో అడుగుపెట్టారు. ఆయనలోని అజ్ఞాత శక్తిపుంజాన్ని దర్శించగలిగిన విశ్వకవి రవీంద్రనాథ్ టాగోర్ (రవీంద్రనాథ్ టాగోర్ కు 1913లో, సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది) సబర్మతి ఆశ్రమానికి వెళ్లి గాంధీజీని 'మహాత్మా' అని సంబోధిస్తూ ఒక ఉపనిషద్మంత్రం పఠించారు. ఆ క్షణం నుంచి గాంధీజీ సకల ప్రపంచానికి మహాత్ముడు. భారతజాతీయ కాంగ్రెస్ 1885 డిసెంబరులో బొంబాయిలో స్థాపితం కావడానికి పదహారు సంవత్సరాల ముందు 1869 అక్టోబర్ 2వ తేదీన పోర్ బందర్లో(కథియవాడ్-గుజరాత్)కరమ్ చంద్ గాంధీ, పుత్లీబాయి దంపతులకు జన్మించిన మూడవ కుమారుడు మోహన్ దాస్ కరమ్ చంద్ గాంధీ. వారిది ఒక వైశ్య కుటుంబం. తల్లిదండ్రుల సేవలో మోహన్ దాస్ కరమ్ చంద్ గాంధీ(గాంధీజీ)బాల్యం గడిచింది. తల్లి పుత్లీబాయి సనాతన ఆచారాలు, సంప్రదాయాల ప్రభావం బాలుడు గాంధీజీ మీద ప్రసరించింది.

బాలుడు గాంధీజీకి తల్లి చెప్పిన మొదటి పాఠం, ముఖ్యపాఠం నిజం చెప్పడం. ఆ పాఠమే ఆయన జీవితానికి ప్రేరణ అయి నడిపింది. ఆ పాఠమే ఆయన జీవితంలో సత్యాన్వేషణ ప్రయోగాలు జరపడానికి స్ఫూర్తిని ఇచ్చింది. ఆ పాఠమే ఆయనను మహాత్మునిగా తీర్చిదిద్దింది. ప్రపంచంలోని ఏ విశ్వవిద్యాలయం, ఏ గురుపుంగవుడు నేర్పలేని విలువయిన మహిమాన్విత పాఠాన్ని ఆయన తన తల్లి ఒడిబడిలో నేర్చుకున్నాడు. మనిషికి మనిషికి మధ్య దడి కట్టరాదన్న గుడి పాఠం అది. 1875లో, ఆరు సంవత్సరాల పసితనంలో గాంధీజీ పోర్ బందర్లో ఇంటి సమీపంలో ఉన్న సెంట్రల్ స్కూలులో విద్యార్జన ప్రారంభించారు. మరుసటి సంవత్సరం 1876లో తండ్రి కరమ్‌చంద్ పోర్‌బందర్ నుంచి రాజ్‌కోట్ కు(గుజరాత్)మకామ్ మార్చాడు. 1883 మే నెలలో పోర్ బందర్లో కస్తూర్బా నఖన్జీతో గాంధీజీ వివాహం జరిగింది. అప్పుడు వారిద్దరి వయస్సు పదమూడు సంవత్సరాలు. సమాన వయస్సులో పెళ్లి. వివాహంతో గాంధీజీ చదువు ఆగలేదు. 1887లో గాంధీజీ మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయినారు. తండ్రి కరమ్‌చంద్ మృతి అనంతరం అన్న లక్ష్మీదాస్ తమ్ముడి (గాంధీజీ)చదువు బాధ్యతను తన భుజాలమీద వేసుకున్నారు. అన్న లక్ష్మీదాస్ అందించిన నిధులతో గాంధీజీ 1888 సెప్టెంబరులో లండన్ వెళ్ళారు, యూనివర్సిటీ కాలేజీలో న్యాయశాస్త్రం చదివి బారిస్టరుగా శిక్షణ పొందడానికి. అప్పుడు ఆయన వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు. గాంధీజీ విదేశాలకు వెళ్లడం ఆయన కులం(వైశ్య)పెద్దలకు ఇష్టం కాలేదు. గాంధీజీ కుటుంబాన్ని కులం పెద్దలు వెలివేసారు. వెలివేతను లెక్క చేయని గాంధీజీ అబద్ధాలు ఆడనని, మద్యం, మాంసం ముట్టనని తల్లి పుత్లీబాయికి మాట ఇచ్చి లండన్ బయలు దేరారు. లండన్లో ఎన్ని ఇబ్బందులు ఎదురయినా గాంధీజీ తల్లికి ఇచ్చిన మాటకు కట్టుబడి ఉన్నాడు. లండన్లో న్యాయశాస్త్రం చదువుతూ గాంధీజీ వెజిటేరియన్ సొసైటీ కార్యకలాపాలలో పాల్గొన్నారు. భగవద్గీత, బైబిల్ తదితర గ్రంథాల అధ్యయనం చేసారు. భగవద్గీత చదివారా అని గాంధీజీని లండన్లో ఒక ఆంగ్లేయ మిత్రుడు ప్రశ్నించాడు. చదువలేదని నిజం చెప్పుతూ గాంధీజీ సిగ్గుపడ్డాడు. నిజం చెప్పకుండా ఉండలేదు, సిగ్గుపడక తప్పలేదు. లండన్లో విద్యార్థిగా గాంధీజీ చాలా కష్టపడ్డారు. నియమబద్ధ, నిజాయితీ

జీవితం గడుపుతూ గాంధీజీ ఆ కౌమార వయస్సులో ప్రయోజనకర పాఠాలు ఎన్నో నేర్చుకున్నారు. అనంతర జీవితంలో గాంధీజీ ప్రపంచానికి ఒక మహాత్ముడుగా వెలుగుబాట చూపించడానికి అంకురార్పణ లండన్లో ఒక విద్యార్థిగా ఉన్నప్పుడే జరిగింది.

## లండన్లో భగవద్గీతతో పరిచయం

కఠినమయిన ఒక పరీక్షలో నెగ్గిన సంతృప్తి కలుగాలంటే లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణత పొందాలని ఒక మిత్రుడు గాంధీజీకి సూచించాడు. లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు రాయాలంటే చాల కష్టపడాలి. ఆ పరీక్షకు చదివితే అదనంగా ఖర్చు ఏమీలేకుండానె తన విజ్ఞానం హెచ్చుతుందని గాంధీజీ గ్రహించారు. మిత్రుడి సూచన గాంధీజీకి నచ్చింది. అయితే, లండన్ మెట్రిక్యులేషన్ సిలబసును చూసి గాంధీజీ భయపడ్డారు. లాటిన్ భాష, ఒక ఆధునిక భాష నిర్బంధ విషయాలు. వాటిని చదువక తప్పదు. లాటిన్ భాషను నేర్చుకోవడం కష్టమని గాంధీజీ భయపడ్డారు. 'న్యాయవాదులకు లాటిన్ ఎంతో విలువయిన భాష. న్యాయశాస్త్రాన్ని అవగాహన చేసుకోవడానికి లాటిన్ ఎంతో ఉపకరిస్తుంది. రోమన్ లా పేపర్ ఒకటి పూర్తిగా లాటిన్ లోనె ఉంటుంది. లాటిన్ పరిజ్ఞానం ఉంటే ఇంగ్లీషులో ప్రావీణ్యం సాధ్యమవుతుంది...' అని మిత్రుడు వివరించాడు. మిత్రుడి మాటల ప్రభావం గాంధీజీపై గాఢంగా ప్రసరించింది. ఎంత కష్టమయినా లాటిన్ నేర్చుకోవడానికి గాంధీజీ నిశ్చయించారు. అప్పటికే నేర్చుకుంటున్న ఫ్రెంచి భాషను ఆయన ఆధునిక భాషగా ఎంపిక చేసుకున్నారు. గాంధీజీ ఒక ప్రయివేటు మెట్రిక్యులేషన్ తరగతిలో చేరారు. ఆరు నెలలకు ఒకసారి పరీక్షలు జరుగుతాయి. గాంధీజీకి మిగిలి ఉన్నవి అయిదు మాసాలే. అసాధ్య కార్యాన్ని సాధించడానికి ఆయన సంకల్పించారు. రోజూ ఎప్పుడు ఏం చేయాలో తెలిపే ఒక కార్య ప్రణాళికను ఆయన రూపొందించారు. అయిదు మాసాల స్వల్ప వ్యవధిలో ఆయన లాటిన్, ఫ్రెంచి భాషలను, ఇతర విషయాల పాఠ్యాంశాలను అధ్యయనం చేయలేకపోయారు. పర్యవసానంగా ఆయన లాటిన్ భాష పరీక్షలో ఉత్తీర్ణత పొందలేకపోయారు. ఆ పరీక్షలో వైఫల్యం ఆయనకు బాధ కల్గించింది. కాని, ఆయన అధైర్య పడలేదు. లాటిన్ లో ఆయనకు ఆసక్తి హెచ్చింది గాని తగ్గలేదు.

రెండవ సారి పరీక్షకు కూర్చుంటే ఫ్రెంచి భాషలో ఎక్కువ మార్కులు వస్తాయని ఆయన అనుకున్నారు. సైన్సు గ్రూపులో రసాయనిక శాస్త్రం ఆయనకు ఇష్టమయినదే. ప్రయోగాలు లేనందువల్ల అది ఆయనను ఆకర్షించలేక పోయింది. భారతదేశంలో రసాయనిక శాస్రం నిర్బంధ విషయం గనుక లండన్ మెట్రిక్యులేషనుకు గాంధీజీ దానిని ఎంపిక చేసుకున్నారు. రెండవసారి పరీక్ష రాయడానికి ఆయన భౌతిక శాస్త్రం విషయాలను(ఉష్ణం, కాంతి)ఎంపిక చేశారు. రసాయనిక శాస్త్రాన్ని వదిలేశారు. భౌతికశాస్త్రం ఆయనకు సులభంగా కన్పించింది. లండన్ మెట్రిక్యులేషన్ పరీక్ష రెండవసారి రాయడానికి సిద్ధమవుతూ గాంధీజీ తన జీవన సరళిలో మరికొన్ని మార్పులు చేసారు-ఖర్చులు తగ్గించడానికి ఉద్దేశించిన మార్పులు ఇవి. తమ కుటుంబ ఆర్థిక పరిస్థితికి తగినట్లుగా తన ఖర్చులు ఇంకా తగ్గాలని గాంధీజీ భావించారు. తాను అడిగినప్పుడల్లా అన్న భారతదేశం నుంచి ఎంతో కష్టపడి డబ్బు పంపిస్తున్నారని ఆయన బాధపడ్డారు. తనకంటె నిరాడంబరంగా లండన్లో జీవితం గడుపుతున్న వారిని గాంధీజీ చూసారు. స్కాలర్షిప్ లు ఉన్నవారే నెలకు ఎనిమిది నుంచి పదిహేను పౌండ్ల వరకు ఖర్చు చేస్తున్నారని ఆయనకు తెలుసు. స్కాలర్షిప్ లేని విద్యార్థుల జీవితం గడువడం కష్టమే. పేద విద్యార్థులు ఎంత కష్టపడుతున్నారో ఆయన గమనించారు. ఒక పేద విద్యార్థి మురికిపేటలో ఒక గదిలో ఉంటున్నాడు, ఆ గది అద్దె వారానికి రెండు షిల్లింగులు. రెండు పెన్సుల కోకోఆ, బ్రెడ్ తో ఆ పేద విద్యార్థి భోజనం పూర్తి అవుతుంది. ఆ విద్యార్థిని ఆదర్శంగా తీసుకుని, అంత నిరాడంబరంగా జీవితం గడుపడం తనకు సాధ్యం కాదనుకున్నారు ఆయన.

ఏమయినా, రెండు గదుల బదులు కేవలం ఒక గదితోనె సరిపెట్టుకోవాలని గాంధీజీ నిశ్చయించారు. ఆ గదిలోనె వంట గూడ ప్రారంభించాలని ఆయన నిర్ణయించారు. ఒక గదిలో ఉంటూ, వంట చేసుకుంటే ప్రతినెలా దాదాపు అయిదు పౌండ్లు ఆదాచేయవచ్చని ఆయన అంచనా వేసారు. నిరాడంబర జీవితం ఏవిధంగా గడుపాలో తెలిపే గ్రంథాలు గాంధీజీకి కన్పించాయి. ఒక గదిలోకి మారి, ఒక స్టవు కొని ఆయన వంట ప్రారంభించారు. పొద్దున్నే ఇరవయి నిమిషాల్లో ఆయన బ్రేక్ ఫాస్ట్ కు అవసరమయిన అల్పాహారాన్ని సిద్ధం చేసేవాడు.

పగలు భోజనం బయట చేసి, రాత్రి పూట భోజనానికి ఆయన తనవంట పైనే ఆధారపడేవాడు. రాత్రి భోజనం బ్రెడ్, కోకోఆతో పూర్తయ్యేది. గాంధీజీ తన సరికొత్త పొదుపు చర్యలతో దైనిక వ్యయాన్ని ఒక షిల్లింగు-మూడు పెన్సులకు తగ్గించారు. ఒక వంక ఖర్చు తగ్గించి మరోవంక గాంధీజీ చదువు మీద దృష్టిని కేంద్రీకరించారు. బాగా కష్టపడి రాత్రింబవళ్లు చదివారు. నిరాడంబర జీవితంతో గాంధీజీ వ్యయాన్ని తగ్గించారు. సమయాన్ని గరిష్ఠ స్థాయిలో వినియోగించగలిగారు. తమ కుటుంబ ఆర్థిక పరిస్థితికి, పరిమిత ఆర్థిక వనరులకు తగినట్లుగా వ్యయాన్ని తగ్గించి నిరాడంబర జీవితం గడుపడంలో గాంధీజీకి ఆనందం లభించింది. అప్పుడు తన జీవితం నిజాయితీతో గడచిందని, అపరిమితమయిన ఆత్మానందం లభించిందని గాంధీజీ తన ఆత్మకథలో రాసారు. 1890 జనవరి 13 నుంచి 18 వరకు గాంధీజీ మొదటిసారి లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు కూర్చున్నారు. ఫిబ్రవరి 19వ తేదీన ఫలితం ప్రకటితమయింది. ఆయన లాటిన్ లో ఫెయిలయ్యారు. రెండవసారి పరీక్ష రాసి 1890 జూన్ లో ఆయన లండన్ మెట్రిక్యులేషన్ పూర్తి చేసారు. అదే సంవత్సరం జనవరి 23 నుంచి 30 వరకు ఆయన వెంటార్ లో వెజిటేరియన్ కాంగ్రెసులో పాల్గొన్నారు. జూన్ లో మెట్రిక్యులేషన్ పూర్తి చేసిన పిదప గాంధీజీకి లండన్ లో ఇద్దరు ఈశ్వరజ్ఞానులతో పరిచయమయింది. వారితో కలిసి ఆయన మాథివ్ ఆర్నాల్డ్ ఆంగ్లంలోకి అనువదించిన భగవద్గీతను(దిసాంగ్ సెలెస్టియల్)పఠించారు. సంస్కృతంలో భగవద్గీతను పఠించడానికి ఆ ఈశ్వరజ్ఞానులు గాంధీజీని ఆహ్వానించారు. అంతకు ముందెన్నడూ గాంధీజీ భగవద్గీతను చదువలేదు. గీతా పఠనం ఆయనపై గాఢ ప్రభావం కల్గించింది. అనంతర జీవితంలో గాంధీజీ ప్రతిరోజు భగవద్గీతను పఠించేవారు. ఆ రోజుల్లోనె గాంధీజీ లండన్ లో దాదాభాయి నౌరోజీ ప్రసంగాలు విన్నారు. నౌరోజీతో ఒకసారి మాట్లాడారు. ఆ సంవత్సరం సెప్టెంబర్ 19వ తేదీన గాంధీజీ లండన్ వెజిటేరియన్ సొసైటీ కార్యవర్గానికి ఎంపికయ్యారు.

## గాంధీజీ గ్రంథపఠనం

ఆదివారం నాడు కలిసినప్పుడు(లండన్లో విద్యార్థిగా ఉన్నప్పుడు)గాంధీజీ ఆ వారం తాను చదివిన మతగ్రంథాల గురించి మిస్టర్ కోట్స్‌కు వివరించేవారు.

ఆ గ్రంథాలు తనపై కల్గించిన ప్రభావం గురించి ఆయన చెప్పేవారు. ఇద్దరు వృద్ధ మహిళలు హారిస్, గ్యాబ్ తమ కమనీయ అనుభవాలను, తమకు కలిగిన ప్రశాంతిని వివరించేవారు. కోట్స్ కాపట్యం లేని యువకుడు. దృఢ విశ్వాసాలు గలవాడు. గాంధీజీ, కోట్స్ కలిసి వాహ్యాళికి-వాకింగ్ కు వెళ్లేవారు. ఆయన గాంధీజీని ఇతర క్రిస్టియన్ మిత్రులవద్దకు తీసుకవెళ్లేవాడు. ఇద్దరి మధ్య సాన్నిహిత్యం ఏర్పడింది. కోట్స్ తను ఎంపిక చేసి ఇచ్చిన గ్రంథాలతో గాంధీజీ గది నిండింది. కోట్స్ ఇచ్చిన పుస్తకాలన్నిటిని చదువడానికి గాంధీజీ అంగీకరించారు. తాను చదివిన ప్రతి పుస్తకం గురించి గాంధీజీ ఆయనతో చర్చించేవారు. 1893వ సంవత్సరంలో ప్రెటోరియాలో గాంధీజీ దాదాపు ఎనభయి మత గ్రంథాలను చదివారు. ఆ పుస్తకాలన్నిటి పేర్లు తనకు జ్ఞాపకం లేదని గాంధీజీ ఆత్మకథలో రాసారు. సిటీ టెంపుల్ కు చెందిన డాక్టర్ పార్కర్ రచించిన "కామెంటరీ", పియర్సన్ రాసిన "మెనీ ఇన్ ఫాలిబుల్ ప్రూఫ్స్", బట్లర్ రచించిన "అనాలజీ" గ్రంథాలను గాంధీజీ తమ ఆత్మకథలో ప్రస్తావించారు. ఈ గ్రంథాలలో కొన్ని అంశాలు ఆయనకు నచ్చాయి, కొన్ని అంశాలు నచ్చలేదు. వాటిలో కొన్ని విషయాలు తనకు అర్థం కాలేదని గాంధీజీ స్పష్టంగా చెప్పారు. బైబిల్ మతాన్ని సమర్థిస్తూ పియర్సన్ రాసిన గ్రంథం గాంధీజీపై ఎటువంటి ప్రభావాన్ని కల్గించలేదు. పార్కర్ గ్రంథం కామెంటరీ నైతికంగా గాంధీజీకి ప్రేరణ కల్గించింది. అప్పటికి క్రిస్టియన్ మత విశ్వాసాలలో నమ్మకం లేని వారికి కామెంటరీ ఏ విధంగాను ఉపకరించదని గాంధీజీ అభిప్రాయపడ్డారు. బట్లర్ రచించిన అనాలజీ క్లిష్టమయిన ఉద్గ్రంథమని, సరిగ్గా అర్థం చేసుకోవాలంటే ఆ గ్రంథాన్ని నాలుగయిదు పర్యాయాలు చదువాలని గాంధీజీ రాసారు. అనాలజీ నాస్తికులను ఆస్తికులుగా మార్చడానికి రాసిన గ్రంథమని గాంధీజీ భావించారు. గాంధీజీ అప్పటికే నాస్తికత్వం దశనుంచి బయటికి వచ్చారు. భగవంతుని అస్తిత్వాన్ని నిరూపిస్తూ అనాలజీ గ్రంథంలో చేసిన వాదనలు తనకు అవసరమని గాంధీజీ వివరించారు. జీసస్ ఒక్కడే భగవంతుని అవతారమని, భగవంతునికి మనిషికి నడుమ దూత జీసస్ అని అనాలజీ గ్రంథంలో చేసిన వాదన ప్రభావం తనపై ప్రసరించలేదని ఆయన చెప్పారు.

కోట్స్ సులభంగా పరాజయాన్ని అంగీకరించే వ్యక్తికాడు. ఆయనకు గాంధీజీ పట్ల అమిత ప్రేమ, వాత్సల్యం. గాంధీజీ మెడలోని వైష్ణవ తులసి మాలను కోట్స్ చూసారు. ఆ విధంగా మెడలో మాలవేసుకోవడం మూఢాచారమని కోట్స్ అభిప్రాయం. గాంధీజీ మెడలోని మాల కోట్సుకు బాధ కల్గించింది. "ఈ మూఢాచారం మీకు తగినది కాదు. మీ మెడలోని తులసి మాలను తెంచి వేయనివ్వండి" అని కోట్స్ అన్నాడు. "దానిని తెంచి వేయగూడదు. అది మా తల్లి ఇచ్చిన పవిత్రమయిన కానుక" అని గాంధీజీ అడ్డుపడ్డారు. "మీకు దానిలో విశ్వాసం ఉందా" అని కోట్స్ ప్రశ్నించాడు. "ఆ మాల అగోచర ప్రాధాన్యం ఏమిటో నాకు తెలియదు. మాలను ధరించక పోతే నాకు ఏదయినా హాని జరుగుతుందో లేదో తెలియదు. మా అమ్మ ఎంతో ప్రేమతో నా మెడలో ఈ మాల వేసింది. అది నా శ్రేయస్సుకు దోహద పడుతుందని ఆమె విశ్వాసం. బలమయిన కారణం ఏది లేకుండా ఈ మాలను తీసివేయలేను. కొంత కాలం గడచిన తరువాత మాల దానంతట అదే తెగిపోతే ఇంకో కొత్త మాల వేసుకోవాలన్న కోర్కె నాకు లేదు. ఈ మాలను మాత్రం తెంచడానికి వీలులేదు" అంటూ గాంధీజీ సమాధానం ఇచ్చారు. గాంధీజీ మతం పట్ల కోట్స్ కు గౌరవం లేదు. అందువల్ల, ఆయనకు గాంధీజీ వాదన నచ్చలేదు. గాంధీజీని అజ్ఞానపు అంధకారం నుంచి బయటికి తీసుకరావాలని కోట్స్ అనుకున్నారు. ఇతర మతాలలో ఏదో కొంత నిజం ఉన్నప్పటికి, సత్యానికి ప్రతిబింబమయిన క్రైస్తవ మతాన్ని అనుసరించక పోతే మోక్షం లభించదని గాంధీజీకి నచ్చజెప్పాలని కోట్స్ నిశ్చయించారు. పాపాలను క్షాళనం చేసుకోవాలంటే జీసస్ ను ఆశ్రయించక తప్పదని గూడ కోట్స్ అన్నాడు.

కోట్స్ అనేక మత గ్రంథాలను గాంధీజీ చేత చదివించారు. అనేక క్రిస్టియన్ మిత్రులకు ఆయన గాంధీజీని పరిచయం చేసారు. క్రిస్టియన్లలో ప్లిమోత్ బ్రెదరన్ శాఖకు చెందిన ఒక కుటుంబం వారికి ఆయన గాంధీజీని పరిచయం చేసాడు. ఆయన పరిచయం చేసిన వారిలో చాలామంది సజ్జనులే, భక్తిపరులే, పాపభీతి గలవారే. ప్లిమోత్ బ్రెదరన్ కుటుంబం వారిలో ఒకరు జీసస్ ను అనుసరించిన వారికే ప్రశాంతి లభిస్తుందని అంటూ చేసిన వాదన గాంధీజీకి నచ్చలేదు.

"ఇదే క్రైస్తవ మతం అయినట్లయితే దానిని నేను అంగీకరించలేను. నా పాపాల పరిణామాల నుంచి విముక్తి కోసం నేను ప్రయత్నించడం లేదు. పాపాలకు దూరంగా ఉండాలనుకుంటున్నాను..."అని గాంధీజీ వినయ పూర్వకంగా సమాధానం ఇచ్చారు. 1891లో గాంధీజీకి లండన్ విశ్వవిద్యాలయం నుంచి బారిస్టర్ సర్టిఫికేట్ లభించింది. లండన్ వెళ్లడానికి(చదువుకోసం)ముందే 1883 సంవత్సరంలో గాంధీజీకి కస్తూర్బా నఖన్ జీతో పెళ్లి జరిగి ఒక కొడుకు పుట్టాడు. కౌమారదశలో, సాంసారిక జీవనంలో కలిగిన అనుభవాలను గాంధీజీ తమ ఆత్మకథలో వివరించారు. స్వదేశం తిరిగి వచ్చి గాంధీజీ రాజ్ కోట్ లో, బొంబాయిలో న్యాయవాదవృత్తిని చేపట్టారు. కాని, ఆయనకు సంతృప్తి కలుగలేదు. న్యాయవాద వృత్తిలో ఆయన రాణించలేకపోయారు. లండన్ నుంచి వచ్చిన తరువాత బొంబాయిలో గాంధీజీ చేపట్టిన మొదటి కేసులో(1892 మేనెలలో)విజయం సాధించలేకపోయారు. దక్షిణాఫ్రికా వెళ్లేవరకు ఇదే గాంధీజీ చివరికేసు. న్యాయవాద వృత్తిలో విఫలమయినా ఆ అనుభవాలతో గాంధీజీ ఎంతో ఎత్తు ఎదిగారు. అబ్దుల్లా కంపెనీ పక్షాన న్యాయవాదిగా వ్యవహరించడానికి 1893లో గాంధీజీ దక్షిణాఫ్రికా వెళ్ళారు. అప్పటివరకు ఆయనకు రాజకీయాలు, ఉద్యమాల ఆలోచనలు లేవు. నాటల్ లో దాదాఅబ్దుల్లాకు ఉన్న స్థానం ప్రెటోరియాలో సేఠ్ తయ్యబ్ హాజీ ఖాన్ మొహమ్మద్ కు ఉంది. ప్రెటోరియాలో తయ్యబ్ హాజీఖాన్ చాల ముఖ్యమయిన వ్యక్తి. ప్రెటోరియాకు వెళ్లిన తరువాత మొదటి వారంలోనె గాంధీజీ ఆయనను పరిచయం చేసుకున్నారు. ప్రెటోరియాలో నివసిస్తున్న ప్రతి భారతీయుడితో పరిచయం చేసుకోవాలనుకుంటున్నానని గాంధీజీ ఆయనతో అన్నారు. ప్రెటోరియాలోని భారతీయుల పరిస్థితిని గాంధీజీ సాకల్యంగా పరిశీలించాలనుకున్నారు. తన ఉద్దేశాన్ని గాంధీజీ సేఠ్ కు వెల్లడించారు. సేఠ్ సహాయాన్ని గాంధీజీ అభ్యర్థించారు. సహాయ పడడానికి సేఠ్ సంతోషంతో అంగీకరించాడు.

## గాంధీజీ పుస్తక రచన

నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ సమావేశాలలో అనేక విషయాలపై చర్చలు జరుగుతుండేవి. బహిరంగ చర్చలలో పాల్గొనే అలవాటు, అనుభవం ఎవరికీ లేవు.

తమ అభిప్రాయాలను క్లుప్తంగా, సూటిగా వ్యక్తపరచడం వారికి తెలియదు. సమావేశంలో ధైర్యంగా నిలుచుని మాట్లాడడానికి అందరూ జంకేవారు. గాంధీజీ సమావేశం జరిగే పద్ధతిని, నిర్వహణ నిబంధనలను వివరించి చెప్పారు. నిబంధనలను అందరు గౌరవించి పాటించారు. సమావేశాలలో, చర్చలలో పాల్గొనడం తమకు ఒక విధంగా విద్యార్జన వంటిదని నాటాల్ భారతీయులు గుర్తించారు. అంతవరకు బహిరంగ సమావేశాలలో మాట్లాడడం అలవాటు లేని వారు అనేకులు ప్రజాహిత అంశాలపై ధైర్యంగా ప్రసంగించడం నేర్చుకున్నారు. ప్రజాహిత, ప్రజాసేవా కార్యక్రమాలలో అతిస్వల్ప వ్యయానికి సైతం వివరంగా లెక్కలు రాయవలసిన అవసరం ఉంటుందని గాంధీజీ భావించారు. అందువల్ల, ఆయన మొదట్లో రసీదు బుక్కులను సైతం ముద్రించకుండా పొదుపు చేసారు. తమ కార్యాలయంలో ఉన్న సైక్లోస్టయిల్ మెషిన్ తోనె గాంధీజీ రసీదులను, నివేదికలను రూపొందించారు. నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ సభ్యుల సంఖ్య పెరిగి ఆదాయం హెచ్చిన తరువాతనే ఆయన రసీదులను, నివేదికలను ముద్రింపజేయడం ప్రారంభించారు. ప్రతి సంస్థ తన నిధులను చాలా జాగ్రత్తగా, పొదుపుగా ఖర్చు చేయాలని గాంధీజీ విశ్వసించారు. అన్ని సంస్థలలో పొదుపు జరుగడంలేదని ఆయనకు తెలుసు. ఒక చిన్న సంస్థ క్రమంగా విస్తరిస్తున్నప్పుడు స్వల్ప విషయాలలో గూడ జాగరూకత వహించాలని ఆయన అనుకున్నారు. సభ్యులు చాల మంది రుసుము చెల్లించి రసీదులు అడుగకపోయేవారు-అలక్ష్య ధోరణిని ప్రదర్శించేవారు. కాని, సభ్యులనుంచి తీసుకున్న మొత్తాలకు తప్పనిసరిగ, వెంటనే రసీదులు ఇవ్వాలని గాంధీజీ పట్టుదల వహించారు. ప్రతి పైసకు గాంధీజీ లెక్కలు రాయించారు. 1894 సంవత్సరపు లెక్కల పుస్తకాలు అనేక సంవత్సరాల అనంతరం గూడ నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ రికార్డులలో భద్రంగా ఉన్నాయని గాంధీజీ తమ ఆత్మకథలో రాసారు. ఆదాయ వ్యయాల లెక్కలు సరిగాలేనట్లయితే ఏ సంస్థ అయినా అప్రతిష్టపాలవుతుందని ఆయన వివరించారు. ఏదయినా సంస్థ పారదర్శకతకు లెక్కలు ముఖ్యమయినవని ఆయన రాసారు.

నాటాల్లో పుట్టి పెరిగి విద్యావంతులయిన భారతీయులకు సేవ చేయడానికి నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ అధ్వర్యాన ఇండియన్ ఎడ్యుకేషనల్ అసోసియేషన్ ఒకటి స్థాపితమయింది. అసోసియేషన్ సభ్యులలో అత్యధిక సంఖ్యాకులు యువ విద్యావంతులు. వారు నామమాత్రంగా కొద్ది రుసుము చెల్లించవలసి వచ్చేది. భారతీయ విద్యావంతులు, విశేషించి యువకులు వారి అవసరాలను, సమస్యలను వివరించడానికి, వారిలో ఆలోచనలు రేకెత్తడానికి అసోసియేషన్ దోహదపడింది. భారతీయ వర్తకులతో పరిచయం కలుగడానికి, సంబంధాలు ఏర్పడడానికి యువకులు, అసోసియేషన్ సభ్యులు క్రమం తప్పకుండా తరచు సమావేశమయి వివిధ విషయాలపై ప్రసంగాలు కావించేవారు. తాము రాసిన పత్రాలను చదివేవారు. అసోసియేషన్లో ఒక చిన్న గ్రంథాలయం ఏర్పాటయింది. నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ చేపట్టిన మూడవ కార్యక్రమం ప్రచారానికి సంబంధించినది. నాటాల్లోని పరిస్థితులను యధాతథంగా దక్షిణాఫ్రికాలోని, ఇంగ్లాండులోని ఆంగ్లేయులకు, భారతదేశ ప్రజలకు తెలియపరచడం ఈ ప్రచారంలో ముఖ్యభాగం. ప్రచారం నిమిత్తం గాంధీజీ రెండు చిన్న పుస్తకాలను రచించారు. మొదటి పుస్తకం శీర్షిక 'దక్షిణాఫ్రికాలోని ప్రతి ఆంగ్లేయుడికి ఒక విజ్ఞప్తి'. అందులో గాంధీజీ నాటాల్ భారతీయుల పరిస్థితులను సాక్ష్యాధారాలతో వివరించారు. రెండవ పుస్తకం శీర్షిక 'భారతీయుల వోటింగ్ హక్కు–ఒక విజ్ఞప్తి'. నాటాల్లోని భారతీయుల వోటింగ్ హక్కు వివరాలన్నీ ఆ రెండవ పుస్తకంలో ఉన్నాయి. ఎంతో అధ్యయనం చేసి, చాల కష్టపడి గాంధీజీ ఆ రెండు పుస్తకాలు రాసారు. తన శ్రమకు ఆ పుస్తకాలతో ఫలితం లభించిందని గాంధీజీ సంతోషించారు. రెండు పుస్తకాలు విస్తృత స్థాయిలో అనేకులకు పంపిణీ అయినాయి. నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ కార్యక్రమాల వల్ల నాటాల్ భారతీయులకు దక్షిణాఫ్రికాలో ఎందరో మిత్రులయ్యారు. భారతదేశంలోని పార్టీలన్నీ నాటాల్ భారతీయుల పట్ల క్రియాత్మక సానుభూతి ప్రదర్శించాయి. దక్షిణాఫ్రికా భారతీయులకు నిర్దిష్ట కార్యాచరణ మార్గం లభించింది.

హృదయంలోని పవిత్రకాంక్ష సర్వదా నెరవేరుతుందని గాంధీజీ ప్రగాఢంగా విశ్వసించారు. విశ్వసించడమే గాక అది తన జీవితంలో అనుభవమని గూడ ఆయన వివరించారు.

పేదలకు సేవ చేయాలన్నది తన హృదయపూర్వక కాంక్ష అని, ఆ కాంక్ష కారణంగా పేదలకు సన్నిహితంగా వెళ్లగలిగానని, పేదల మధ్య ఉండగలిగానని గాంధీజీ తమ ఆత్మకథలో వివరించారు. నాటాల్లో పుట్టిన భారతీయులు, ఉద్యోగాలు చేయడానికి వచ్చిన భారతీయులు మాత్రమే నాటాల్ ఇండియన్ కాంగ్రెసులో రుసుము చెల్లించి సభ్యులుగా చేరారు. కూలీలుగా, కార్మికులుగా పని చేస్తున్న భారతీయులు సభ్యులుగా చేరలేదు. కాంగ్రెసులో సభ్యత్వం కోసం అవసరమయిన రుసుము వారు చెల్లించలేరు. వారికి సేవ చేయడం ద్వారా వారితో కాంగ్రెస్ సన్నిహిత సంబంధం పెట్టుకోగలుగుతుందని గాంధీజీ అనుకున్నారు. భారతీయ కార్మికులు, కూలీలకు సేవచేసే అవకాశం కాంగ్రెసుకు లభించింది. అప్పుడు గాంధీజీ, నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ వారు సేవ చేయడానికి సిద్ధంగా లేరు. ఆ తరువాత సంవత్సరాలలో లండన్లో బ్రిటిష్ పాలకుల ముందు ఒక ఫకీరుగా కూర్చుని నిష్ఠుర నిజాలు మాట్లాడేవాడు గాంధీజీ. ఆయనను ఫకీరు అని అవహేళన చేసింది ఆంగ్లేయపాలకులే. తన దేశం కోసం ఆయన అన్ని అవమానాలను చిరునవ్వుతో సహించారు.

## చలిలో, చీకటిగదిలో, గాంధీజీ ఆలోచనలు

అబ్దుల్లా సేఠ్ కేసును లాయర్ కు వివరించడానికి గాంధీజీ 1893 జూన్ లో దర్బాన్ నుంచి ప్రెటోరియా బయలుదేరారు. ఆ ప్రయాణంలో సంభవించిన ఒక సంఘటన గాంధీజీ జీవితంలో ఎన్నడూ మరువరానిది. 1893 మే నెలలో దర్బాన్ నుంచి ప్రెటోరియా వెళ్ళుతున్న గాంధీజీని తెల్ల అధికారులు జాతి వివక్షతతో, వర్ణద్వేషంతో పీటర్ మారిట్జ్ బర్గ్ స్టేషన్ లో రైలు నుంచి కిందికి దించి అవమానించారు–మొదటి తరగతి రైలు టికెట్ ఉన్నప్పటికి! జోహెన్స్ బర్గ్ లోని గ్రాండ్ నేషనల్ హొటల్ లో ఆయనకు వసతి లభించలేదు–ఎముకలను కొరికే చలిలో ఆ రాత్రి ఆయన ప్లాట్‌ఫామ్ మీదే గడిపారు. గాంధీజీ మొదటి తరగతి పెట్టెలో కూర్చున్నారు. రైలు రాత్రి 9 గంటలకు. మారిట్జ్ బర్గ్ స్టేషనులోనె పడక ఏర్పాటు చేసేవారు. ఒక రైల్వే ఉద్యోగి వచ్చి గాంధీజీని పడక కావాలా అని అడిగాడు. 'అక్కరలేదు. నాకు బెడ్డింగ్ ఉంది' అని

గాంధీజీ సమాధానం చెప్పారు. రైల్వే ఉద్యోగి వెళ్లిపోయిన తరువాత ఒక ప్రయాణీకుడు వచ్చి గాంధీజీని పైనుంచి కిందికి వింతగా చూసాడు. గాంధీజీ నల్లవాడని తెలియడంతో అతను ఉద్రేకపూరితుడయ్యాడు. అతను బయటికి వెళ్లి మరో ఇద్దరు అధికారులతో కలిసి వచ్చాడు. వాళ్లంతా మాట్లాడకుండా నిల్చున్నారు. మరో అధికారి గాంధీజీ వద్దకు వచ్చి 'నా వెంట రా. నువు వ్యాన్ కంపార్ట్మెంటుకు వెళ్లాలి' అన్నాడు. వ్యాన్ కంపార్ట్మెంట్ మూడవ తరగతి పెట్టె. 'నాకు మొదటి తరగతి టికెట్ ఉంది' అని గాంధీజీ అన్నారు. 'ఉన్నా లాభంలేదు. నువు వ్యాన్ కంపార్ట్మెంటులోకి వెళ్లవలసిందే' అని ఆ అధికారి గట్టిగా అన్నాడు. 'ఈ పెట్టెలో కూర్చుని ప్రయాణం చేయడానికి నాకు దర్బాన్ లో అనుమతి ఇచ్చారు. నేను ఇందులోనె కూర్చుని ప్రయాణం చేస్తాను' అని గాంధీజీ నొక్కి చెప్పారు. 'లేదు. నువు ఇందులో కూర్చోవడానికి వీలులేదు. ఇందులో నుంచి బయటికి రావాలి. రాకపోతే, ఇందులో నుంచి నిన్ను బయటికి గెంటడానికి ఒక పోలీస్ కాన్సిటేబుల్ ను పిలవవలసి వస్తుంది' అని అధికారి హెచ్చరించాడు. 'పోలీసును పిలువండి. నేను మాత్రం దిగను' అని గాంధీజీ జవాబిచ్చారు. అధికారి ఒక పోలీసు కాన్సిటేబుల్ ను తీసుకవచ్చాడు. పోలీసు గాంధీజీని పెట్టె నుంచి బయటికి గెంటి వేశాడు. గాంధీజీ లగేజీని బయట పడేసారు. గాంధీజీ మరో పెట్టెలో ఎక్కడానికి నిరాకరించారు. స్టేషన్ నుంచి రైలు వెళ్లిపోయింది. బయట పడి ఉన్న లగేజీని ముట్టకుండా గాంధీజీ తన హ్యాండ్ బ్యాగ్ ను మాత్రం తీసుకుని వెయిటింగ్ రూమ్ కు వెళ్లి కూర్చున్నారు. రైల్వే స్టేషన్ అధికారులు గాంధీజీ లగేజీని స్వాధీనపరచుకున్నారు.

అది చలికాలం. దక్షిణాఫ్రికా మిట్ట ప్రాంతాలలో చలి మరింత తీవ్రంగా ఉంటుంది. మారిట్జ్‌బర్గ్ లో చలి విపరీతంగా ఉంది. గాంధీజీ ఆ చలిలో వణకిపోయారు. తన లగేజీలో ఉన్న ఓవర్ కోట్ ను అడిగి తీసుకోవడానికి గాంధీజీ సంకోచించారు. ఓవర్ కోట్ అడిగితే మళ్లీ తనను అవమానిస్తారని ఆయన భయపడ్డారు. వెయిటింగ్‌రూమ్ లో కూర్చుని ఆయన ఎముకలను కొరికే చలిని భరించలేకపోయారు. వెయిటింగ్‌రూమ్ లో దీపం లేదు. నడిరాత్రి ఓ ప్రయాణికుడు వచ్చి గాంధీజీతో మాట్లాడడానికి ప్రయత్నించాడు.

ఆయన మాట్లాడడానికి ఇష్టపడలేదు. వణికిస్తూ, శరీరాన్ని మంచుగడ్డ వలె మార్చుతున్న చలిలో, చీకటి గదిలో మౌనంగా కూర్చుని గాంధీజీ తన విధి నిర్వహణ గురించి ఆలోచించసాగారు. అక్కడే ఉండి తన హక్కుల కోసం పోరాడాలా లేక భారతదేశం వెళ్లి పోవాలా? అవమానాలను భరిస్తూ ప్రెటోరియాకు వెళ్లాలా? కేసు పని పూర్తికాగానె భారతదేశం తిరిగి వెళ్లాలా? ఇటువంటి ప్రశ్నలు గాంధీజీ మస్తిష్కాన్ని తొలచివేసాయి. తన విధులను, బాధ్యతలను పూర్తి చేయకుండా భారతదేశం వెళ్లిపోవడం పిరికితనం అని గాంధీజీ భావించారు. తాను ఎదుర్కొంటున్న కష్టం దక్షిణాఫ్రికాలోని జాతి వివక్షత జబ్బు దుష్ఫలితమని ఆయన అనుకున్నారు. ఎన్ని కష్టాలు, నష్టాలు ఎదురయినా ఆ జబ్బును నిర్మూలించాలని గాంధీజీ ఆ రాత్రి వేళ నిశ్చయించారు. జాతి వివక్షత నిర్మూలనకు అవసరమయిన చర్యలు తీసుకోవాలని ఆయన అనుకున్నారు. వెంటనే అందుబాటులో ఉన్న ట్రెయిన్ లో ప్రెటోరియా వెళ్లాలనీ గాంధీజీ నిర్ణయించారు.

## గాంధీజీపై దాడులు

మరునాడు ఉదయం గాంధీజీ రైల్వే అధికారి అక్రమాన్ని వివరిస్తూ రైల్వే జనరల్ మేనేజర్ కు ఒక టెలిగ్రామ్ పంపించారు. రైల్వే స్టేషన్ సంఘటన గురించి ఆయన అబ్దుల్లా సేఠ్ కు గూడ తెలియజేసారు. అబ్దుల్లా సేఠ్ ఎంతమాత్రం ఆలస్యం చేయకుండా రైల్వే జనరల్ మేనేజర్ ను కలిసి మాట్లాడాడు. రైల్వే అధికారుల ప్రవర్తనను జనరల్ మేనేజర్ సమర్థించారు. గాంధీజీ సురక్షితంగా తమ గమ్యస్థానం చేరే సదుపాయం కల్పించాలని మారిట్జ్ బర్గ్ రైల్వేస్టేషన్ అధికారులకు ఆదేశం పంపినట్లు జనరల్ మేనేజర్ వెల్లడించారు. గాంధీజీని కలిసి ఆయనకు తగిన సదుపాయాలు కల్పించాలని కోరుతూ అబ్దుల్లా సేఠ్ మారిట్జ్ బర్గ్ లోని భారతీయ వర్తకులకు, ఇతర స్థలాలలోని మిత్రులకు టెలిగ్రామ్‌లు పంపించాడు. భారతీయ వర్తకులు కొందరు గాంధీజీని కలిసి మాట్లాడడానికి స్టేషన్ కు వచ్చారు. రైల్వే అధికారుల ప్రవర్తన అసాధారణమయినది కాదని, తాము ఎన్నో కష్టాలు ఎదుర్కోవలసి వస్తున్నదని భారతీయ వర్తకులు గాంధీజీకి వివరించారు. మొదటి లేక రెండవ తరగతి పెట్టెలలో రైలులో ప్రయాణిస్తున్న భారతీయులకు రైల్వే అధికారులు,

శ్వేతజాతి ప్రయాణికుల వల్ల ఎన్నో ఇబ్బందులు, కష్టాలు ఎదురవుతుంటాయని భారతీయ వర్తకులు పూసగుచ్చినట్లు గాంధీజీకి తెలియజేసారు. భారతీయ వర్తకుల బాధల గురించి వింటూ గాంధీజీ ఆరోజంతా గడిపారు. సాయంత్రం ప్రెటోరియా వెళ్లే రైలు వచ్చింది. అందులో గాంధీజీకి ఒక బెర్త్ రిజర్వయి ఉంది. గాంధీజీ మారిట్జ్ బర్గ్ స్టేషన్లో ఒక బెడ్డింగ్ టికెట్ గూడ కొన్నారు. రైలులో గాంధీజీ చార్లెస్ టౌన్ చేరారు. మరో సందర్భాన శ్వేతజాతి దుండగులు గాంధీజీపై అమానుషంగా దాడి చేసి, దౌర్జన్యం జరిపి నేల మీద పడేసారు. స్పృహ కోల్పోయిన గాంధీజీని చూసి ఆయన చనిపోయాడనుకుని దుండగులు అక్కడి నుంచి పారిపోయారు. మరో సందర్భాన గాంధీజీపై దుండగులు తుపాకి కాల్పులు జరిపారు. ఇంకో సందర్భాన గాంధీజీ ఒకరి ఇంటిలో రక్షణ పొందవలసి వచ్చింది. ఇటువంటి ఎన్నో దాడులను దక్షిణాఫ్రికాలో గాంధీజీ ఎదుర్కోవలసి వచ్చింది. దక్షిణాఫ్రికాలో నల్లజాతీయులు, విశేషించి అక్కడికి వలసవెళ్ళిన భారతీయులు జాతి వివక్షతకు గురి అవుతూ ఎదుర్కొంటున్న ఇబ్బందులు, కష్టాలను గాంధీజీ స్వయంగా రుచి చూసారు. ఇక ఈ అన్యాయాలను, అక్రమాలను, అధర్మాన్ని, అమానుష కృత్యాలను వ్యష్టిగా, సమష్టిగా, సంఘటితంగా ఎదుర్కొని ప్రతిఘటించాలన్న ఆలోచనలు ఆయన మనసులో, మస్తిష్కంలో అంకురించాయి. అచంచల వజ్ర సంకల్పంతో గాంధీజీ అన్నారు–"...you can chain me, you can torture me, you can even destroy this body, but you will never imprison my mind...". ఇదే దృఢ సంకల్పంతో గాంధీజీ చివరి శ్వాస వరకు జీవించారు. సుదీర్ఘ పోరాటం కోసం దక్షిణాఫ్రికా భారతీయులను సంఘటిత పరచడానికి గాంధీజీ 1894 ఆగస్టు 22వ తేదీన నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ ను నెలకొల్పారు. ఈ చరిత్రాత్మక సంఘటన అనంతర కాలంలో నెల్సన్ మండేలాకు స్ఫూర్తినిచ్చింది. మార్టిన్ లూథర్ కింగ్ వంటి వారికి ప్రేరణ కల్గించింది. గాంధీజీ ఉద్యమస్ఫూర్తి కారణంగానె నేను ఈరోజు ఇక్కడ నిలువగలిగానని అమెరికా అధ్యక్షుడు బరక్ ఒబామా భారత పార్లమెంటులో అనగలిగారు.

# చరిత్రాత్మక పోరాటం

దక్షిణాఫ్రికాలో నివసించిన ఇరవయి ఒక్క సంవత్సరాలలో(1893-1914) దాదాపు పన్నెండు సంవత్సరాల దీర్ఘకాలం గాంధీజీ దక్షిణాఫ్రికాలో శ్వేతజాతి పాలకుల జాతి వివక్షత విధానాలకు వ్యతిరేకంగా చరిత్రాత్మక పోరాటం కొనసాగించారు. ఇదేకాలంలో ఒక వంక ప్రాథమిక మానవ హక్కుల కోసం అపూర్వ రాజకీయ పోరాటాలు జరుపుతూ గాంధీజీ బోయర్ యుద్ధంలో, ప్లేగు వ్యాధి భయంకరంగా విస్తరించినప్పుడు కార్యకర్తలను సమీకరించి స్వచ్ఛందంగా సామాజిక సేవ, వైద్య సహాయ కార్యక్రమాలను అద్భుతంగా నిర్వహించారు. 1904లో, టాల్ స్టాయ్ ప్రభావంతో గాంధీజీ దర్బాన్ సమీపాన ఫోనిక్స్ లో వ్యవసాయ కాలనీని స్థాపించారు. రస్కిన్, థోరూ, టాల్ స్టాయ్ రచనల, భావాల ప్రభావం తన వ్యక్తిత్వంపై ప్రసరించినప్పటికి గాంధీజీ స్వీయ, దేశీయ, శాంతియుత, అహింసాత్మక పోరాట విధానాలను, వ్యూహాలను స్వయంగా రూపొందించారు. దక్షిణాఫ్రికా శ్వేతజాతి పాలకులు పలు సందర్భాలలో గాంధీజీపై దౌర్జన్యం జరిపారు. ఆయనకు వ్యతిరేకంగా కోర్టులలో కేసులు పెట్టారు. ఆయనను కారాగారాలలో నిర్బంధించారు. శ్వేత పాలకులు దక్షిణాఫ్రికాలో గాంధీజీ చేతులకు సంకెళ్లు వేసి రోడ్లమీద నడిపించారు. గాంధీజీ చేతులకు సంకెళ్లు వేసి నడిపించిన సంఘటనపై 1909 ఏప్రిల్ 12వ తేదీన బ్రిటిష్ పార్లమెంటులో ప్రశ్నించారు. అన్ని నిర్బంధాలను, ఆంక్షలను, అణచివేత చర్యలను అచంచల ధైర్యసాహసాలతో ఎదుర్కొంటూ, సామాజిక సేవా కార్యక్రమాలు గూడ నిర్వహిస్తూ, మరోవంక గాంధీజీ భారతీయుల హక్కుల పరిరక్షణ కోసం రాజకీయ ప్రతిఘటన ఉద్యమం గూడ కొనసాగించారు. గాంధీజీ రూపొందించిన అపూర్వ శాంతియుత, అహింసా పోరాట విధానాలకు దక్షిణాఫ్రికా ఒక ప్రయోగశాలగా ఉపయోగపడింది. సత్యాగ్రహ సమరానికి గాంధీజీ 1909 మార్చిలో దక్షిణాఫ్రికాలోనె అంకురార్పణ జరిపారు. అప్పటికే గాంధీజీ గురించి, ఆయన అహింసా పోరాటం గురించి భారత ప్రజలకు, బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు తదితర దేశాల ప్రజలకు తెలిసింది.

"Non-violence is the first article of my faith. It is also

the last article of my creed...” అని గాంధీజీ ఉద్ఘాటించారు.

ఫ్రెంచి మేధావి రోమరోలా ఫ్రాన్సులో, యూరపులో గాంధీజీని, ఆయన సిద్ధాంతాలను తన రచనల ద్వారా పరిచయం చేసారు. ప్రపంచ ప్రఖ్యాత ఫ్రెంచి ఫిలాసఫర్–తత్వవేత్త–రోమరోలా గత శతాబ్ది ఆరంభంలో రవీంద్రనాథ్ టాగోర్, దీనబంధు సి.ఎఫ్.ఆండ్రూస్ తదితరులతో ఇంటర్వ్యూలు జరిపి రచించిన గాంధీజీ జీవిత–ఉద్యమ చరిత్ర ప్రపంచ ప్రసిద్ధి పొందింది. “This is the man who has stirred three hundred million people to revolt, who has shaken the foundations of the British Empire, and who has introduced into human politics the strongest religious impetus of the last two thousand years...” అంటూ రోమరోలా గాంధీజీని ప్రశంసించారు.

‘The day will come when a weak, noble man absolutely unarmed will prove that the meek shall inherit the earth. It is logical that Mahatma Gandhi weak of the body and without meterial resources should prove the unconqurable strength of meek and the humble hidden in the hearts of the outraged and destitute humanity of India.’ అని దీనబంధు సి.ఎఫ్.ఆండ్రూస్ ప్రస్తుతించారు.

ఆ రోజుల్లోనె టాల్‌స్టాయ్ అమిత ఆసక్తి కనబరుస్తూ గాంధీజీకి లేఖలు రాసారు. టాల్‌స్టాయ్ రాసిన చివరి లేఖ 1910లో ఇండియన్ ఒపినియన్ పత్రిక స్వర్ణ సంచికలో ప్రచురితమయింది. గాంధీజీ అహింసా సిద్ధాంతాల రూపకల్పనలో టాల్‌స్టాయ్ ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. దక్షిణాఫ్రికాలో ఇరవయి ఒక్క సంవత్సరాలు గాంధీజీకి ప్రశాంతంగా గడువలేదుబీ అశాంతి, అవిశ్రాంత పోరాటాలతో ఆయన జీవించవలసి వచ్చింది. అంతేకాదు, సతీమణి కస్తూర్బా అనారోగ్యం ఆయనకు ఆందోళన కల్గించింది. ఆమె బతుకాలంటే మద్యం, మాంసం స్వీకరించక తప్పదని అక్కడి ఆంగ్లేయ డాక్టర్లు ఇచ్చిన సలహాను గాంధీజీ తిరస్కరించారు.

## స్వదేశానికి...

దక్షిణాఫ్రికాలో నిర్విరామ పోరాటం నడుపుతున్న గాంధీజీ స్వదేశంతో-భారతదేశంతో-ఇక్కడి స్వాతంత్ర్య, జాతీయోద్యమ నాయకులతో సన్నిహిత సంబంధాలు పెట్టుకున్నారు. 'స్వరాజ్యం నా జన్మహక్కు' అని చాటిన లోక్ మాన్య బాలగంగాధర తిలక్ తో, బ్రిటిష్ పాలకులు సైతం అపారంగా గౌరవిస్తున్న మహామేధావి గోపాలకృష్ణ గోఖలేతో, ఫిరోజ్ షా మెహతా, దాదాభాయి నౌరోజీ తదితర జాతీయ నాయకులతో గాంధీజీకి సాన్నిహిత్యం ఏర్పడింది. దక్షిణాఫ్రికాలో తాను నిర్వహిస్తున్న పోరాటం తదితర అంశాలపై భారత జాతీయ నాయకులతో గాంధీజీ ఉత్తర ప్రత్యుత్తరాలు నడుస్తుండేవి. విశేషించి గోపాలకృష్ణ గోఖలే, లోక్‌మాన్య తిలక్ లతో గాంధీజీకి చాల సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. గోఖలే తన రాజకీయ గురువు అని గాంధీజీ తరువాత ఒక సందర్భాన ప్రకటించారు. 1906లో, కలకత్తాలో గోఖలే అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభలలో గాంధీజీ(దక్షిణాఫ్రికా నుంచి వచ్చి)పాల్గొన్నారు. ఆ మహాసభ వేదికపై నిలిచి ప్రసంగించడానికి గాంధీజీ ఎంతో భయపడ్డారు. గాంధీజీ ఆహ్వానంపై గోపాలకృష్ణ గోఖలే 1912 అక్టోబరులో దక్షిణాఫ్రికాలో పర్యటించారు. 1905లో బెంగాల్ విభజనను వ్యతిరేకించిన గాంధీజీ భారత స్వాతంత్ర్య, జాతీయోద్యమ పరిణామాలను శ్రద్ధాసక్తులతో గమనించారు. బంకిమ్ చంద్ర రచించిన 'వందేమాతరం' గీతం మన జాతీయగీతం కావాలని గాంధీజీ ఆనాడే అన్నారు. దేశమంతట జాతీయ భావాలు, స్వాతంత్ర్య పిపాస ఒక వంక రగుల్కొంటున్న తరుణంలో భారత జాతీయ కాంగ్రెస్ లో అతివాదులకు, మితవాదులకు మధ్య రాజకీయ విధాన సంబంధ స్పర్థలు ఏర్పడ్డాయి. అవి వ్యక్తిగత విభేదాలు కానేకావు. సత్వర స్వాతంత్ర్య సాధనకు ఎటువంటి విధానాలు అవలంబించాలన్న ప్రశ్న మీదనే విభేదాలు ఏర్పడ్డాయి. రాజకీయ విభేదాల వల్ల భారత జాతీయ కాంగ్రెస్ బలహీనపడింది. భారత స్వాతంత్ర్య, జాతీయోద్యమాలకు అదొక క్లిష్టదశ. భారతజాతీయ కాంగ్రెస్ ను, భారత స్వాతంత్ర్య, జాతీయోద్యమాలను పటిష్ట పరచడానికి ఒక సమర్థుడయిన నాయకుడు

తక్షణ అవసరమని లోక్ మాన్య తిలక్, గోపాలకృష్ణ గోఖలే భావించారు. మాండలే జైలు నిర్బంధంలో భగవద్గీతకు భాష్యం రచించిన, వేదాలను, ఉపనిషత్తులను అపోశనం పట్టిన మహావిజ్ఞాని, స్వాతంత్ర్య సమర సేనాని తిలక్. గాంధీజీమీద తిలక్, గోఖలే దృష్టి ప్రసరించింది. ఈ ఇద్దరు మహానాయకులు భారత స్వాతంత్ర్య ఉద్యమ నాయకత్వం స్వీకరించడానికి గాంధీజీని ఆహ్వానించారు. స్వదేశం తిరిగి రావాలని కోరారు. 1913 నవంబరులో న్యూ కాజిల్ నుంచి ట్రాన్స్‌వాల్ వరకు వేలాది భారతీయులతో మహాయాత్ర నిర్వహించి దక్షిణాఫ్రికా శ్వేతపాలకులను గడగడలాడించిన గాంధీజీ 1914 జూలైలో శాశ్వతంగా వీడ్కోలు పలికి అక్కడి నుంచి లండన్ వచ్చి స్వదేశం బయలుదేరారు. అప్పటికే ఆయన సూట్లు–బూట్లు వదిలేసి సత్యాగ్రహి వేషధారణ ప్రారంభించారు.

## సబర్మతి, చంపారన్

గాంధీజీ 1915 జనవరి 9వ తేదీన బొంబాయిలో నౌక దిగి మాతృభూమి సేవకు ఈ నేలమీద అడుగుపెట్టారు. మాతృభూమి నేలపై అడుగుపెట్టగానె గాంధీజీకి ఆయన తల్లి పుత్లీబాయి మృతి విషాదకర వార్త తెలిసింది. ఆయన పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు. గాంధీజీ లండన్ లో ఉన్నప్పుడే తల్లి మరణించింది. అప్పుడు వెంటనే ఆయనకు ఆ విషయం తెలియజేయలేదు. ఒక సంవత్సరం వరకు ఎటువంటి కార్యక్రమాలు చేపట్టకుండా దేశమంతటా పర్యటించాలని గోపాలకృష్ణ గోఖలే సలహా ఇచ్చారు. కాలినడకన, మూడవ తరగతి రైలు పెట్టెలో ప్రయాణిస్తూ(మోకాళ్ళ మీదికి ధోవతితో, చొక్కా లేకుండా) గాంధీజీ దేశమంతట విస్త ృతంగా పర్యటించారు. తన దేశంలోని కోట్లాది సామాన్యుల, నిరుపేదల దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని, అనారోగ్యాన్ని ఆయన స్వయంగా పరికించారు. కలకత్తా, కాశీ తదితర నగరాలలో పవిత్ర, ప్రముఖ దేవాలయాల వద్ద కన్పించిన అపరిశుభ్రత గాంధీజీకి ఎంతో బాధ కల్గించింది. ఆయనకు ఈ దేశపు దరిద్రనారాయణుల దర్శనమయింది. గాంధీజీని మహాత్ముడని సంబోధించిన గురుదేవ్ రవీంద్రనాథ్ టాగోర్ "..వేలాది దరిద్రుల, నిరుపేదల గుడిసెల వాకిళ్లలో గాంధీజీ వారిలో ఒకడుగా దుస్తులు వేసుకుని నిలిచాడు. వారి భాషలో ఆయన మాట్లాడాడు.

సజీవ సత్యంగా ఆయన కన్పించాడు. దేశ ప్రజలు ఆయనను మహాత్ముడన్నారు. అదే ఆయన పేరు అయింది. భారతీయులందరు తన వారని భావించినవాడు ఆయన ఒక్కడే..” అని ఉద్వేగంతో ఉద్ఘోషించారు. గాంధీ మహాత్ముడు, గురుదేవ్ రవీంద్రుడు పలు విషయాలలో సిద్ధాంతపరంగా విభేదించారు. కాని, వ్యక్తిగతంగా ఒకరినొకరు అమితంగా గౌరవించుకుని అద్వైతం పొందారు. వారిద్దరిది ఆత్మీయ అనుబంధం. తానిక ప్రారంభించబోయే స్వాతంత్రోద్యమ కార్యక్రమాల కేంద్రంగా 1915 మే నెలలో అహమదాబాద్ లో గాంధీజీ సబర్మతీ ఆశ్రమాన్ని స్థాపించారు. బీహారులో చంపారన్ రైతుల హక్కుల కోసం సత్యాగ్రహ ఉద్యమం నిర్వహించి, తరువాత బార్డోలి రైతుల పోరాటానికి మార్గదర్శకత్వం వహించి, అహమదాబాద్ లో మిల్లు కార్మికుల సమ్మెలు నడిపి గాంధీజీ తన శాంతియుత సత్యాగ్రహం, అహింస ఆయుధాల పటుత్వాన్ని నిరూపించారు. అహింస ఆయుధంతో స్వాతంత్ర్యం లభిస్తుందా అన్న సందేహాన్ని కొందరు వ్యక్తపరిచారు. గాంధీజీ 1915 జనవరిలో స్వదేశంలో అడుగుపెట్టి దేశమంతట పర్యటించిన తరువాత మొట్టమొదట నిర్వహించింది బీహారులో చంపారన్ సత్యాగ్రహం. చంపారన్ గ్రామాలలో రైతుల హక్కుల పరిరక్షణ కోసం గాంధీజీ భారత స్వాతంత్రోద్యమంలో భాగంగా చంపారన్ సత్యాగ్రహ కార్యక్రమాన్ని నిర్వహించారు. చంపారన్ సత్యాగ్రహం నాటి నుంచి బాబూ రాజేంద్రప్రసాద్(స్వతంత్ర భారతదేశం మొదటి రాష్ట్రపతి–రాజ్యాంగ నిర్ణయసభ అధ్యక్షుడు)గాంధీజీ అనుయాయిగా భారత స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. గాంధీజీకి పరమ విధేయుడు, ప్రథమ విధేయుడు రాజేంద్రప్రసాద్ అన్న పేరు వచ్చింది. తన సత్యాగ్రహ, సహాయనిరాకరణ, శాసనోల్లంఘన శాంతియుత సమరాలకు గాంధీజీ(చంపారన్ నుంచి దండి వరకు)గ్రామీణ ప్రాంతాలను ఎంపిక చేసుకున్నారన్నది గమనార్హ విషయం. గాంధీజీ ప్రబోధిస్తున్న శాంతియుత ప్రతిఘటన, సత్యాగ్రహం శక్తివంత ఆయుధాలని దేశ ప్రజలు గుర్తించసాగారు. మొదట గాంధీజీ సత్యాగ్రహ విధానాల పట్ల సందేహాలను వ్యక్తపరచిన సర్దార్ పటేల్, మోతీలాల్ నెహ్రూ తదితర నాయకులు గూడ తరువాత ఆయనపట్ల గౌరవాన్ని, ఆయన విధానాలపట్ల విశ్వాసాన్ని వ్యక్తపరిచారు.

ఆయన నాయకత్వంలోనె నడిచారు. లండన్ నుంచి రాగానె న్యాయవాద వృత్తిని చేపట్టిన జవహర్లాల్ నెహ్రూ(మోతీలాల్ నెహ్రూ కుమారుడు)మాత్రం తండ్రితో ఎన్ని వాదనలు జరిగినా, తండ్రి ఎంతగా విభేదించినా మొదటినుంచి గాంధీజీ నాయకత్వాన్ని అంగీకరించి గాంధీజీ సిద్ధాంతాలను, విధానాలను గట్టిగా బలపరిచారు. గాంధీజీతో జవహర్లాల్ నెహ్రూ ఏకీభవించని సందర్భాలు ఒకటి రెండు కంటె ఎక్కువ ఉండవు. శాంతియుత మార్గంలో శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ ఉద్యమాలను, సత్యాగ్రహ సమరాలను, నిరాహార దీక్షలను నిర్వహించడానికి గాంధీజీకి ఎక్కువ సమయం పట్టలేదు. నిజానికి నిరాహార దీక్షలను, సత్యాగ్రహాలను గాంధీజీ దక్షిణాఫ్రికాలోనే ప్రారంభించారు. మొట్టమొదటి నిరాహార దీక్షను 1913లో దక్షిణాఫ్రికాలో గాంధీజీ నిర్వహించారు. 1913 జనవరి 13 నుండి గాంధీజీ వివిధ సందర్భాలలో పదిహేడు పర్యాయాలు చరిత్రాత్మక నిరాహార దీక్షలు నిర్వహించారు. 1908 జనవరి నుంచి (దక్షిణాఫ్రికాలో)1942 ఆగస్టు 9వరకు(బొంబాయిలో)గాంధీజీ పదిహేను పర్యాయాలు అరెస్టయి కారాగార శిక్షలు అనుభవించారు. తన సిద్ధాంతాలు, విధానాల విషయంలో ఎన్నడూ, అణుమాత్రమయినా రాజీపడని మహానాయకుడు గాంధీజీ. గోరఖ్ పూర్(ఉత్తరప్రదేశ్) సమీపంలోని చౌరీచౌరాలో, శాసనోల్లంఘన కార్యక్రమం సందర్భాన హింసాత్మక చర్యలు సంభవించినప్పుడు గాంధీజీ ఆ కార్యక్రమాన్ని విరమించారు. విరమణపై విమర్శలు చెలరేగినా గాంధీజీ ఖాతరు చేయలేదు. తన నాయకత్వంలో పొరపాట్లు జరిగినప్పుడు ఆత్మవిమర్శతో ఆత్మశుద్ధి కోసం ప్రాయోపవేశ(నిరాహార)దీక్షలు నిర్వహించారు. 'తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు' అన్నమాటకు అతీతుడు గాంధీజీ. తన తప్పులను గుర్తించి అంగీకరించడానికి ఆయన ఎన్నడు వెనుకాడలేదు-హిమాలయన్ బ్లండర్స్ జరిగాయని గాంధీజీ అంగీకరించిన సందర్భాలున్నాయి.

## మహత్తర తీర్మానం

మాంటెగ్-క్లెమ్స్ ఫర్డ్ సంస్కరణలను, రౌలట్ చట్టాన్ని, సైమన్ కమిషనును వ్యతిరేకించడంతో గాంధీజీ శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ ఉద్యమాలకు ఊపు వచ్చింది. దేశప్రజలు కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకు లక్షల సంఖ్యలో

స్త్రీలు, పురుషులు, యువతీ యువకులు, వృద్ధులు, వివిధ వర్గాల, వృత్తులవారు గాంధీజీ శంఖారావం విని ఉద్యమాలలో పాల్గొన్నారు. అరెస్టయి కారాగార నిర్బంధాలు అనుభవించారు, తమ జీవిత సర్వస్వాలను ఉద్యమాలకు అంకితం కావించారు. సంపూర్ణ స్వరాజ్యం, స్వాతంత్ర్యం తమ లక్ష్యమని గాంధీజీ నాయకత్వంలో భారత జాతీయ కాంగ్రెస్ 1929 డిసెంబర్ లో, లాహోరులో రావీ నదీ తీరాన మహత్తర తీర్మానాన్ని ఆమోదించింది. భారతస్వాతంత్ర్య, జాతీయ ఉద్యమాలకు సారథ్యం వహిస్తున్న భారత జాతీయ కాంగ్రెస్ లో తన మాటకు ఎదురులేనప్పటికి గాంధీజీ దేశప్రజల అభిప్రాయాలకు, విశేషించి భారతజాతీయ కాంగ్రెస్ ఇతర నేతల భావాలకు, అభిప్రాయాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చేవాడు. పార్టీ నియంతగా మారే అవకాశం ఉన్నప్పటికి ఆయన మారలేదు. ప్రజాస్వామ్యానికి, పార్టీ అంతర్గత ప్రజాస్వామ్యానికి అత్యధిక ప్రాధాన్యం ఇచ్చిన అధినేత గాంధీజీ. 1928-29 సంవత్సరాలలో సర్ జాన్ సైమన్ కమిషన్ (బ్రిటిష్ ప్రభుత్వం నియమించిన కమిషన్) ను దేశమంతట బహిష్కరించిన పిదప భారత రాజ్యాంగ రచనకు తగిన సూచనలు ఇవ్వడానికి అఖిలపక్ష మహాసభ మోతీలాల్ నెహ్రూ చైర్మన్ గా ఒక కమిటీని నియమించింది. భారతదేశానికి డొమినియన్ స్థాయి కల్పించాలని మోతీలాల్ నెహ్రూ కమిటీ సూచించింది. అఖిలపక్ష మహాసభ కొన్ని మార్పులతో మోతీలాల్ కమిటీ నివేదికను ఆమోదించింది. 1929 ప్రారంభంలో కలకత్తాలో మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభలో జవహర్లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ డొమినియన్ స్థాయి ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ వ్యతిరేకతలోని సహేతుకతను, సమంజసత్వాన్ని గాంధీజీ గుర్తించారు. అందువల్ల, మోతీలాల్ కమిటీ నివేదికను కలకత్తా కాంగ్రెస్ మహాసభ ఆమోదించినప్పటికి, 1929 డిసెంబర్ లో లాహోరులో రావీ నదీ తీరాన జవహర్లాల్ నెహ్రూ అధ్యక్షతన కాంగ్రెస్ మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్య సాధన తీర్మానాన్ని ఆమోదించడానికి గాంధీజీ హృదయపూర్వకంగా దోహదపడి యువశక్తి వైఖరిని నిండుమనస్సుతో ఆశీర్వదించారు. సంపూర్ణ స్వాతంత్ర్య సాధన తీర్మానాన్ని అమలు చేయడానికి లాహోరు కాంగ్రెస్ మహాసభ గాంధీజీకి పూర్తి అధికారం ఇచ్చింది.

అంతకుముందు, దేశప్రజలను అంతిమ పోరాటాలకు సిద్ధపరచే నిమిత్తం గాంధీజీ నడుంబిగించారు. 1915 నుంచి 1948 వరకు గాంధీజీ ఒకే ఒకసారి 1922లో బెల్గామ్ లో భారత జాతీయ కాంగ్రెస్ కు అధ్యక్షత వహించారు. అయినప్పటికి, అధ్యక్షులు ఎవరయినప్పటికి భారత జాతీయ కాంగ్రెసులో గాంధీజీదే చివరిమాట. ఆయనతో విభేదించిన నేతాజీ సుభాష్ చంద్రబోస్ 1938లో హరిపురలో, 1939లో త్రిపురిలో కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎన్నికయినప్పటికి ఆ పదవిలో కొనసాగలేకపోయారు.

## దండి సత్యాగ్రహం

భారత స్వాతంత్ర్య, జాతీయోద్యమాల అప్రకటిత, వాస్తవ అధినేతగా గాంధీజీ 1928, 29 సంవత్సరాలలో దేశమంతట మారుమూల ప్రాంతాలకు సైతం వెళ్ళి, విస్తృతంగా పర్యటించారు. కోట్లాది ప్రజలకు తన సందేశం అందిస్తూ అంతిమ సత్యాగ్రహ సమరానికి సిద్ధపరిచారు. ఒకవంక బ్రిటిష్ పాలకులతో లండన్ లో రౌండ్ టేబుల్ సమావేశాలు, చర్చలు జరుపుతూ మరోవంక గాంధీజీ దేశ ప్రజలకు సత్యాగ్రహ సమరోత్సాహం కల్గించారు. 1929 డిసెంబర్ 31వ తేదీన లాహోరులో రావీ నదీ తీరాన జవహర్లాల్ నెహ్రూ అధ్యక్షతన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభ ఆమోదించిన సంపూర్ణ స్వరాజ్య తీర్మానం అమలు బాధ్యతను గాంధీజీకే ఆ సభ అప్పగించింది. శాంతియుత శాసనోల్లంఘన కార్యక్రమంలో పరాకాష్టగా గాంధీజీ ఉప్పు సత్యాగ్రహానికి రూపకల్పన చేసారు. తన జీవితంలో ఇది చివరి పోరాటమని, ఈ పోరాటంలో భగవంతుడు ఒక సాధనంగా తనను ఉపయోగించాలనుకుంటున్నాడని గాంధీజీ ఉప్పు సత్యాగ్రహం(దండి సత్యాగ్రహం)ప్రారంభమయిన తరువాత నాలుగు రోజులకు 1930 మార్చి 16న ప్రకటించారు. ఇది హక్కులు, అధికారానికి మధ్య జరుగుతున్న పోరాటమని గూడ ఆయన ప్రపంచానికి తెలియచేసారు. గాంధీజీ 1930 మార్చి 12వ తేదీన అహమదాబాద్ లోని సబర్మతి ఆశ్రమం నుంచి 78 మంది అనుచరులతో కలిసి దండియాత్ర ప్రారంభించారు. అంతకుముందు ఆయన బ్రిటిష్ పాలన అనర్థాలను వివరిస్తూ లార్డ్ ఇర్విన్ (వైస్రాయి)కి ఒక లేఖ రాసారు. 24రోజులలో 360 కిలోమీటర్లు నడిచి గాంధీజీ, ఆయన అనుచరులు

1930 ఏప్రిల్ 5వ తేదీన గుజరాత్ సముద్రతీర గ్రామం దండి చేరారు. మరునాడు ఏప్రిల్ 6వ తేదీన గాంధీజీ సముద్రంలో మునిగి ఉప్పు తీసి శాసనోల్లంఘన జరిపారు. సబర్మతి నుంచి దండి వరకు అడుగడుగున లక్షలాది ప్రజలు గాంధీజీకి జయధ్వానాలతో స్వాగతం పలికారు. దేశమంతట ఉప్పు సత్యాగ్రహం పెద్ద యెత్తున జరిగింది. గాంధీజీతో సహా 90 వేలమందిని బ్రిటీష్ ప్రభుత్వం దేశమంతట అరెస్టు చేసింది. ప్రజలు పన్నులు కట్టడానికి నిరాకరించారు.

## జీవితమే సందేశం

గాంధీజీ గొప్ప ప్రబోధకుడు. తాత్విక చింతనాపరులలో, అధ్యాత్మిక భావ సంపన్నులలో గాంధీజీ అగ్రగణ్యుడు. తన మత విశ్వాసాలు, తన రాజకీయాలు, జనహిత కార్యక్రమాలు స్వాతంత్ర్య ఉద్యమాలలోకి చొరబడకుండా ఆయన సర్వదా జాగరూకత వహించారు. 'వైష్ణవజనతో' గీతంతో పాటు ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి భజన గీతాలను వినడానికి ఆయన ఇష్టపడేవాడు. నిష్కళంక, నిర్మల జీవితం గడిపిన గాంధీజీ 'నాజీవితమే నా సందేశం' అని అనగలిగారు. ఇంకెవరూ ఈ మాట అనలేరు. గాంధీజీ తత్వాన్ని గురించి తెలుసుకోదలచిన వారు ఆయన జీవితం, ఆయన వ్యక్తిత్వ ఔన్నత్యం గురించి తెలుసుకోవడం ముఖ్యం. దేశమంతట అసంఖ్యాక సమావేశాలు, సభలలో ప్రసంగిస్తూ ఆయన తన సిద్ధాంతాలను, సత్యం, అహింస ఆశయాలను, శాంతియుత సత్యాగ్రహ ఉద్యమాలను, అస్పృశ్యత నివారణ, హరిజనోద్ధరణ, స్త్రీల సమానత్వం, రాట్నం, ఖద్దరు, కుటీర-గ్రామీణ పరిశ్రమలు, గ్రామీణ అభివృద్ధి, గ్రామ స్వరాజ్యం, మద్యపాన నిషేధం తదితర నిర్మాణ కార్యక్రమాలను వివరించారు. గ్రామీణ అభివృద్ధి మీదనే దేశ ప్రగతి ఆధారపడి ఉందని ఆయన గాఢంగా విశ్వసించారు. గ్రామాలకు తిరిగి వెళ్లాలన్నది గాంధీజీ నినాదం. గ్రామస్వరాజ్యానికి, గ్రామీణ వికాసానికి, గ్రామ స్థాయి నుంచి కేంద్రస్థాయి వరకు అధికార వికేంద్రీకరణకు గాంధీజీ ఇచ్చిన విలువ, ప్రాధాన్యం ఇంకెవ్వరూ ఇవ్వలేదు. గాంధీజీ అసాధారణ పత్రికా రచయిత, సంపాదకుడు. ఆయన సంపాదకత్వంలో వెలువడిన నవజీవన్, హరిజన్ పత్రికలు భారత స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించాయి. గాంధేయ సాహిత్యం

కొన్ని సంపుటాలలో ప్రచురితమయింది. ఆయన ప్రతిమాట, ప్రతి రాత శక్తివంత మంత్రాక్షరాలయినాయి. ఆయన ప్రతి చేత రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం పునాదులను పెకలించి స్వేచ్ఛా ప్రపంచ నిర్మాణానికి దోహదపడింది. సర్ విన్స్టన్ చర్చిల్ వంటి బ్రిటిష్ పాలకులు నేకెడ్(నగ్న)ఫకీర్ అని ఈసడించినా ఆయన ప్రభంజనం ఆగలేదు.

ఇక తన ఓరిమి, సహనం నశించాయని గాంధీజీ ప్రకటించారు. భారత ప్రజలకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి అంగీకరిస్తే రెండవ ప్రపంచయుద్ధంలో తమ సహకారం అందివ్వగలమని కాంగ్రెస్ వర్కింగ్ కమిటి చేసిన ప్రతిపాదనను బ్రిటిష్ ప్రభుత్వం తిరస్కరించింది. ఇక క్విట్ ఇండియా నినాదం ఇవ్వక తప్పదని గాంధీజీ భావించారు. కొందరు కాంగ్రెస్ అగ్రనాయకులు వెనుకాడారు, సందేహించారు. కాని, గాంధీజీ చొరవతో, పట్టుదలతో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ, ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ 1942 ఆగస్టు 8వ తేదీన బొంబాయిలో సమావేశమయి క్విట్ ఇండియా తీర్మానాన్ని ఆమోదించాయి. ఈ చరిత్రాత్మక తీర్మానాన్ని గాంధీజీ స్వయంగా రూపొందించారు. ఆ సందర్భాన గాంధీజీ కావించిన ప్రసంగం మహత్తరమయినది. ఆ ప్రసంగ పాఠం ఇది-

## Quit India Speech by Gandhiji on 9th August 1942 at Bombay AICC Meeting

"Before you discuss the resolution, let me place before you one or two things, I want you to understand two things very clearly and to consider them from the same point of view from which I am placing them before you. I ask you to consider it from my point of view, because if you approve of it, you will be enjoined to carry out all I say. It will be a great responsibility. There are people who ask me whether I am the same man that I was in 1920, or whether there has been any change in me. You are right in asking that question.

Let me, however, hasten to assure that I am the same Gandhi as I was in 1920. I have not changed in any fundamental respect. I attach the same importance to non-violence that I did then, if at all, my emphasis on it has grown stronger. There is no real contradiction between the present resolution and my previous writings and utterances.

Occasions like the present do not occur in everybody's and but rarely in anybody's life. I want you to know and feel that there is nothing but purest Ahimsa in all that I am saying and doing today. The draft resolution of the Working Committee is based on Ahimsa, the contemplated struggle similarly has its roots in Ahimsa. If, therefore, there is any among you who has lost faith in Ahimsa or is wearied of it, let him not vote for this resolution.

Let me explain my position clearly. God has vouchsafed to me a priceless gift in the weapon of Ahimsa. I and my Ahimsa are on our trial today. If in the present crisis, when the earth is being scorched by the flames of Himsa and crying for deliverance, I failed to make use of the God given talent, God will not forgive me and I shall be judged un-wrongly of the great gift. I must act now. I may not hesitate and merely look on, when Russia and China are threatened.

Ours is not a drive for power, but purely a non-violent fight for India 's independence. In a violent struggle, a successful general has been often known to effect a military coup and to set up a dictatorship. A non-violent soldier of freedom will covet nothing for himself, he fights only for the freedom of his country. The Congress is unconcerned as to who will rule, when freedom is attained. The power, when it comes, will belong to the people of India, and it will be for them to decide to whom it placed in the entrusted. May be that the reins will be placed in the hands of the Parsis,

for instance-as I would love to see happen-or they may be handed to some others whose names are not heard in the Congress today. It will not be for you then to object saying", "This community is microscopic. That party did not play its due part in the freedom's struggle; why should it have all the power" Ever since its inception the Congress has kept itself meticulously free of the communal taint. It has thought always in terms of the whole nation and has acted accordingly......

I know how imperfect our Ahimsa is and how far away we are still from the ideal, but in Ahimsa there is no final failure or defeat. I have faith, therefore, that if, in spite of our shortcomings, the big thing does happen, it will be because God wanted to help us by crowning with success our silent, unremitting Sadhana for the last twenty-two years.

I believe that in the history of the world, there has not been a more genuinely democratic struggle for freedom than ours. I read Carlyle's French Revolution while I was in prison, and Pandit Jawaharlal has told me something about the Russian revolution. But it is my conviction that inasmuch as these struggles were fought with the weapon of violence they failed to realize the democratic ideal. In the democracy which I have envisaged, a democracy established by non-violence, there will be equal freedom for all. Everybody will be his own master. It is to join a struggle for such democracy that I invite you today. Once you realize this you will forget the differences between the Hindus and Muslims, and think of yourselves as Indians only, engaged in the common struggle for independence.

Then, there is the question of your attitude towards the British. I have noticed that there is hatred towards the British among the people. The people say they are disgusted with their behavior.

The people make no distinction between British imperialism and the British people. To them, the two are one-this hatred would even make them welcome the Japanese. It is most dangerous. It means that they will exchange one slavery for another. We must get rid of this feeling. Our quarrel is not with the British people, we fight their imperialism. The proposal for the withdrawal of British power did not come out of anger. It came to enable India to play its due part at the present critical juncture, it is not a happy position for a big country like India to be merely helping with money and material obtained willy-nilly from her while the United Nations are conducting the war. We cannot evoke the true spirit of sacrifice and valour, so long as we are not free. I know the British Government will not be able to withhold freedom from us, when we have made enough self-sacrifice. We must, therefore, purge ourselves of hatred. Speaking for myself, I can say that I have never felt any hatred. As a matter of fact, I feel myself to be a greater friend of the British now than ever before. One reason is that they are today in distress. My very friendship, therefore, demands that I should try to save them from their mistakes. As I view the situation, they are on the brink of an abyss. It, therefore, becomes my duty to warn them of their danger even though it may, for the time being, anger them to the point of cutting off the friendly hand that is stretched out to help them. People may laugh, nevertheless that is my claim. At a time when I may have to launch the biggest struggle of my life, I may not harbour hatred against anybody".

మరునాడు, 1942 ఆగస్టు 9 ఉదయం గాంధీజీ తదితర అగ్రనాయకులు అందరిని బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసి కారాగారాలలో నిర్బంధించింది. అయినా, క్విట్ ఇండియా ఉద్యమం ఆగలేదు. దేశమంతట లక్షలాది ప్రజలు సత్యాగ్రహాలు చేసి కారాగారాల్లో బంధితులయినారు. బ్రిటిష్ ప్రభుత్వం

ఇక తట్టుకోలేని క్లిష్టపరిస్థితి దేశంలో ఉత్పన్నమయింది. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన పిదప బ్రిటన్ లో ఏర్పడిన లేబర్ పార్టీ నూతన ప్రభుత్వం (అట్లీ ప్రధానమంత్రిగా)భారత ఉపఖండ విభజనకు 1947 జూన్ లో మౌంట్ బ్యాటన్ ప్లాన్ ప్రకటించింది. ఈ ప్లాన్ ను, భారత ఉపఖండ విభజనను గాంధీజీ వ్యతిరేకించారు. గాంధీజీ వ్యతిరేకత కాంగ్రెస్ అగ్రనాయకులకు బాధ కల్గించింది. మౌంట్‌బాటన్ ప్లాన్ తో ఉపఖండ విభజన జరిగి 1947 ఆగస్టు 14, 15 తేదీలలో పాకిస్తాన్, భారతదేశం స్వతంత్ర దేశాలుగా అవతరించాయి. అది గాంధీజీకి అత్యంత విషాద సమయం. మత కలహాగ్నిని చల్లార్చుదానికి గాంధీజీ నౌఖాలీలో, ఢిల్లీలో పర్యటించారు. 1948 జనవరి 30 సాయంత్రం ఢిల్లీ బిర్లాభవన్ లో సర్దార్ వల్లభ్ భాయ్ పటేల్ తో మాట్లాడిన తరువాత గాంధీజీ త్వరత్వరగా ప్రార్థనా స్థలికి వచ్చారు. అదేరోజు సాయంత్రం ఆయన (గాంధీజీ) జవహర్లాల్ నెహ్రూతో మాట్లాడాలనుకున్నారు. ఆరోజు–"1948 జనవరి 30 గాంధీజీ శారీరక జీవితంలో చివరి రోజు. రోజటివలె గాంధీజీ సూర్యోదయానికి చాలముందే నిద్రనుంచి లేచారు. తన వ్యక్తిగత సహాయకుడు బిస్వాన్ ను పిలిచి "నా ముఖ్యమయిన లేఖలన్నిటిని తీసుకరా. ఈరోజే అన్నిటికి జవాబులు రాయాలె. రేపు నేను ఉండకపోవచ్చు..." అని అన్నారు గాంధీజీ. భారత జాతీయ కాంగ్రెస్ సంస్థ భవిష్యత్తు పై గాంధీజీ రాసిన ముసాయిదా పత్రం ప్రతికోసం మధ్యాహ్నం ఆచార్య జుగల్ కిశోర్, శంకర్ రావు దేవ్ వచ్చారు. కాంగ్రెస్ ను రద్దు చేసి, లోక్ సేవక్ సంఘ్ ను స్థాపించాలని గాంధీజీ ఆ ముసాయిదాలో సూచించారు. అమెరికన్ ఫోటోగ్రాఫర్ మార్గరెట్ బర్క్ వైట్ జరిపిన ఇంటర్వ్యూలో గాంధీజీ "ఆటమ్ బాంబునయినా అహింసతో ఎదుర్కోవాలె" అని అన్నారు. మధ్యాహ్నం నాలుగున్నర గంటలకు అభ భోజనం తీసుకవచ్చింది. అదే ఆయన చివరి భోజనం అని ఎవరూ అనుకోలేదు. అప్పుడు సర్దార్ వల్లభ్ భాయ్ పటేల్ (ఉపప్రధానమంత్రి, దేశవ్యవహారాల మంత్రి) గాంధీజీతో తనకు ప్రధాని జవహర్లాల్ నెహ్రూతో ఉత్పన్నమయిన విభేదాల గురించి మాట్లాడుతున్నారు. మణిబెహెన్ గూడ అక్కడ ఉన్నారు. దేశం కోసం ఇద్దరు కలిసి పనిచేయాలని, విభేదాలను విస్మరించాలని ఒక కాగితం ముక్కమీద రాసి, ఆ కాగితాన్ని జవహర్‌లాల్ కు ఇవ్వాలని గాంధీజీ చెప్పారు.

సాయంత్రం అయిదయింది. 'త్వరగా వెళ్లాలె' అంటూ గాంధీజీ ప్రార్థనా స్థలం వైపు నడిచారు. అభ, మను ఇద్దరు గాంధీజీ వెంట నడిచారు. నడుస్తూ గాంధీజీ అన్నారు–"కొద్ది నిమిషాల ఆలస్యం అయింది. ఆలస్యం కావడం నాకు ఇష్టం కాదు. కచ్చితంగా అయిదు గంటలకు నేను ఇక్కడ ఉండాలె." ప్రార్థనా సమావేశంలో అయిదు వేలకంటె ఎక్కువ మంది ఉన్నారు. గాంధీజీ కన్పించగానె అందరు లేచి నిల్చున్నారు. అభ, మను భుజాల మీది నుంచి చేతులు తీసి గాంధీజీ చేతులు ముడిచి నమస్కారం పెట్టారు. ఆ క్షణాన నాథూరామ్ గాడ్సే ముందుకు తోసుకవచ్చి గాంధీజీకి పాదాభివందనం చేస్తున్నట్లు కన్పించి (మను ఆయనను ఆపడానికి ప్రయత్నించి ఆయన తోయగానె కిందపడిపోయింది) తన పిస్టల్ తో గాంధీజీపై మూడు గుండ్లు పేల్చాడు. రెండు గుండ్లకే గాంధీజీ 'హేరామ్' అంటూ నేలకొరిగారు. అప్పటికే సర్దార్ పటేల్ అక్కడికి వచ్చారు. డాక్టర్ చూసి 'ఇక లాభం లేదు' అన్నాడు. ఆ నిమిషంలో హఠాత్తుగా ఒక శకం అంతమయిందన్పించింది. అఖిల భారతావని, సకల ప్రపంచం గాంధీజీ మరణ వార్త విని శోకసముద్రంలో మునిగాయి. మన జీవితాలలో జ్యోతి ఆరిందని, చీకట్లు కమ్ముకున్నాయని జవహర్లాల్ నెహ్రూ రోదిస్తూ ప్రకటించారు –"The light has gone out, I said, and yet I was wrong. For the light that shown in this country was no ordinary light. The light that has illuminated this country for these many many years will illuminate this country for many more years, and thousand years later, that light will be still seen in this country and the world will see it and it will give solace to innumerable hearts". అంటూ జవహర్లాల్ నెహ్రూ దుఃఖించారు.

సకల మానవాళి ఆ మహాత్మునికి అవనతమయి నివాళి పట్టింది. ఇటువంటి మనిషి ఈ భూమిపై నడిచాడని రానున్న తరాలు విశ్వసించలేవని ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ అన్నాడు. ప్రపంచ చరిత్రపై గాంధీజీ ప్రభావం సాటిలేనిదని ప్రపంచ ప్రఖ్యాత చరిత్రకారుడు ఆర్నాల్డ్ టాయెన్బి అభిప్రాయపడ్డాడు. నిజానికి గాంధీజీ జ్యోతి ఆరిపోలేదు. ఆచంద్రతారార్కం వెలుగుతూ అది

మార్గదర్శకమవుతుంది. ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ 2007లో ఒక తీర్మానం చేసి గాంధీజీ పుట్టినరోజు అక్టోబర్ 2ను అంతర్జాతీయ అహింసాదినంగా ప్రకటించి శాంతిదూత కు నీరాజనం పట్టింది. గత రెండువందల సంవత్సరాలలో (పంథొమ్మిది, ఇరువదవ శతాబ్దాలలో)ప్రపంచ మానవాళి అద్భుత వైజ్ఞానిక, పారిశ్రామిక ప్రగతితో ఆధునిక యుగంలో అడుగుపెట్టినప్పటికి గతంలో ఎన్నడూ లేనంతగా అశాంతి పాలయింది, అభద్రతాభావానికి, అనిశ్చిత పరిస్థితికి గురిఅయింది. భయంకర అణ్వస్త్ర, మారణాయుధాల ఉత్పత్తితో మానవాళి తన అస్తిత్వానికి, మనుగడకు పెనుముప్పును ఎదుర్కొంటున్నది. రెండు ప్రపంచ యుద్ధాలు సృష్టించిన వినాశనం, ఆయా దేశాల మధ్య ఆగకుండా కొనసాగుతున్న ప్రాంతీయ యుద్ధాలు, ఘర్షణలు, రక్తపాతం, మతోన్మాదంతో చెలరేగుతున్న టెర్రరిజం, తీవ్రవాదం, మనిషికి మనిషికి మధ్య రగుల్కొంటున్న విద్వేషం, వివక్షత, పతనమవుతున్న విలువలు, ప్రమాణాలు, వెర్రితలలు వేస్తున్న అధికార దాహం, ప్రజాస్వామ్యానికి కట్టుతున్న సమాధి ఈనాటి మానవసమాజంలో అశాంతికి ప్రధానకారణాలు. ఇక ఈ దుస్థితి నుంచి గట్టెక్కడానికి గాంధీమార్గమే శరణ్యం అనడంలో సందేహం లేదు. గాంధీజీ జయంతి సంబరాలను జరుపడంతో సరిపోదు. ఆ మహాత్ముని ఆశయాలను, సిద్ధాంతాలను, విధానాలను గౌరవించి, ఆచరించడం అన్నిటికంటె ముఖ్యం. అదే ఆయనకు సముచిత నీరాజనం, నిజమయిన నివాళి.

***

## గాంధీ మహాత్ముని నిరాహార దీక్షలు పదిహేడు పర్యాయాలు

1913– (దక్షిణాఫ్రికా–ఫోనిక్స్ సెటల్మెంటులో): సెటల్మెంటులోని ఇద్దరు వ్యక్తులు అనైతికంగా ప్రవర్తించినందుకు గాంధీజీ ఒక వారంరోజులు పశ్చాత్తాప నిరాహార దీక్ష జరిపారు. తరువాత నాలుగున్నర మాసాలు రోజుకు ఒకపూటే ఆహారం తీసుకున్నారు.

1914– సెటల్మెంటులో నీతినియమాలకు భంగం కలుగుతున్నదన్న వేదనతో గాంధీజీ పధ్నాలుగు రోజుల నిరాహార దీక్ష పూనారు.

1918 మార్చి 12-(అహ్మదాబాదులో): మిల్లు కార్మికులు పరిష్కారం కుదిరేవరకు సమ్మె కొనసాగించాలని కోరుతూ గాంధీజీ నిరాహార దీక్ష ప్రారంభించారు. మూడురోజుల నిరాహార దీక్ష పిదప పరిష్కారం కుదిరింది.

1919 ఏప్రిల్ 13-(సబర్మతి): నాదియాలో రైలు పట్టాలు తొలగించడానికి కొందరు ప్రయత్నించినప్పుడు పశ్చాత్తాప సూచకంగా గాంధీజీ మూడు రోజులు నిరాహార దీక్ష జరిపారు. పశ్చాత్తాపంతో ప్రజలు ఒకరోజు నిరాహార దీక్ష జరుపాలని గాంధీజీ విజ్ఞప్తి చేశారు. హింసాకాండ జరిపిన వారు తప్పును చేసినట్లు అంగీకరించాలని ఆయన కోరారు.

1921 నవంబరు 9-13-(బొంబాయి): ప్రిన్స్ అఫ్ వేల్స్ రాక సందర్భాన అల్లరులు, రక్తపాతం సంభవించడంతో గాంధీజీ అయిదు రోజులు అన్న పానీయాలు ముట్టలేదు.

1922 ఫిబ్రవరి రెండవ వారం-(బార్డోలి): చౌరీచౌరా హింసాకాండ బాధ కల్గించడంతో అయిదు రోజుల నిరాహారదీక్ష.

1924 సెప్టెంబర్ 18-(ఢిల్లీ): హిందూ, ముస్లిం కలహాలు చెలరేగడంతో ఇరవయి ఒక్క రోజుల నిరాహారదీక్ష. ఐక్యత కోసం గాంధీజీ ప్రార్థన.

1925 నవంబర్ 24-(సబర్మతి): ఆశ్రమవాసుల తప్పిదాలు గాంధీజీ ఏడురోజుల నిరాహార దీక్షకు కారణమయినాయి.

1932 సెప్టెంబర్ 20-(ఎరవాడ జైలు): ప్రత్యేక ఎలెక్టొరేట్ల విషయంలో మక్డొనాల్డ్ అవార్డుకు వ్యతిరేకంగా సెప్టెంబర్ 20 పగలు ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు. ప్రభుత్వం పంపిన సందేశం సంతృప్తి కల్గించడంతో సెప్టెంబర్ 26 సాయంత్రం 5 గంటలకు గాంధీజీ నిరాహార దీక్ష ముగించారు.

1932 డిసెంబరు 22-(ఎరవాడ జైలు): జైలులో పాకీపని చేయడానికి అనుమతించాలని అప్పా సాహెబ్ పట్వర్ధన్ చేసిన అభ్యర్థనను అధికారులు నిరాకరించారు. ఆయన నిరాహార దీక్షకు మద్దతుగా గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించారు. అధికారులు హామీ ఇవ్వడంతో రెండు రోజులలో గాంధీజీ దీక్ష ముగిసింది.

1933 మే 8-(ఎరవాడ జైలు): హరిజనోద్ధరణ విషయంలో స్వీయపరిశుద్ధి నిమిత్తం గాంధీజీ మధ్యాహ్నం 12 గంటలకు 21 రోజుల నిరాహార దీక్ష ప్రారంభించారు. అదేరోజు ప్రభుత్వం ఆయనను జైలు నుంచి విడుదల చేసింది. గాంధీజీ నిరాహార దీక్షను కొనసాగించి పూనాలోని పర్ణకుటిలో మే నెల 29వ తేదీ పగలు 12 గం.కు ముగించారు. ఇది ఇరవయి ఒక్క రోజుల నిరాహారదీక్ష.

1933 ఆగస్టు 16-(ఎరవాడ జైలు): మే నెలలో విడుదలకు ముందు అధికారులు కల్పించిన సౌకర్యాలను గాంధీజీ తిరస్కరించారు. జైలులో హరిజన్ పత్రికకు రాయడానికి గాంధీజీకి అధికారులు అనుమతి ఇవ్వలేదు. ఆగస్టు 20వ తేదీన గాంధీజీ నిరాహార దీక్ష ప్రారంభించారు. ఆయనను ససూన్ ఆసుపత్రికి తరలించారు. ఖైదీగానే ఆయన ఆసుపత్రిలో ఉన్నారు. ఆగస్టు 23 నాటికి గాంధీజీ ఆరోగ్య పరిస్థితి విషమించింది. ప్రభుత్వం ఆయనను బేషరతుగా విడుదల చేసింది.

1934 ఆగస్టు 7-(వార్ధా): హరిజనోద్ధరణను వ్యతిరేకిస్తున్న ఒక వ్యక్తిపై దాడి జరిగింది. ఒకరిపట్ల మరొకరు ప్రదర్శించిన అసహనానికి ఆందోళన చెంది గాంధీజీ ఏడురోజుల నిరాహార దీక్ష ప్రారంభించారు. ఆగస్టు 7 ఉదయం 6 గంటలకు నిరాహారదీక్షను ప్రారంభించి ఆగస్టు 14 ఉదయం 6 గంటలకు విరమించారు.

1939 మార్చి 3-(రాజ్ కోట్): రాజ్ కోట్ పాలకుడు ప్రజలతో చేసుకున్న ఒప్పందాన్ని ఉల్లంఘించినందుకు నిరసనగా గాంధీజీ మార్చి 3 పగలు 12 గంటలకు నిరాహారదీక్ష ప్రారంభించారు. అప్పటి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి సర్ మారిస్ గ్వయర్ మధ్యవర్తిత్వం జరిపి వివాదాన్ని పరిష్కరించాలని వైస్రాయ్ సూచించారు. మార్చి 7వ తేదీ మధ్యాహ్నం 2 గంటల 20 నిమిషాలకు గాంధీజీ దీక్ష విరమించారు.

1943 ఫిబ్రవరి 10-(ఆగాఖాన్ పాలెస్): మూడువారాల(22 రోజుల)నిరాహారదీక్షను గాంధీజీ ఆగాఖాన్ పాలెస్ నిర్బంధంలో ఫిబ్రవరి 10 ఉదయం ఆహారం తీసుకున్న తరువాత ప్రారంభించారు. మార్చి 3 ఉదయం దీక్షను విరమించారు.

1947 సెప్టెంబర్ 1-(కలకత్తా): హిందూ-ముస్లిం ఐక్యతకోసం సెప్టెంబర్ 1 ఉదయం 8 గంటల 15 నిమిషాలకు నిరాహారదీక్ష ప్రారంభించి సెప్టెంబర్ 4 రాత్రి 9 గంటల 15 నిమిషాలకు విరమించారు.

1948 జనవరి 13-(ఢిల్లీ): ఉదయం ఆహారం పిదప నిరాహారదీక్ష ప్రారంభించారు. మతసామరస్యాన్ని కాపాడగలమని నాయకులు లిఖిత పూర్వక హామీ ఇచ్చిన తరువాత గాంధీజీ జనవరి 18వ తేదీన దీక్ష విరమించారు.

## గాంధీజీ అరెస్టులు, కారాగార శిక్షలు

**దక్షిణాఫ్రికాలో:**

1908 జనవరి 10: ప్రభుత్వం ఇచ్చిన నోటీసుకు అనుగుణంగా నమోదు చేసుకోలేదని, ట్రాన్స్ వాల్ వదిలివెళ్ళలేదని ఆరోపించి గాంధీజీని అరెస్టు చేసి మేజిస్ట్రేట్ ముందు ప్రవేశపెట్టారు. నాయకుడిని గనుక తనకు కఠినాతికఠినమైన శిక్షను విధించాలని గాంధీజీ న్యాయమూర్తికి చెప్పారు. కాని, న్యాయస్థానం ఆయనకు రెండు మాసాల సాధారణ కారాగారశిక్ష విధించింది. 1908 జనవరి 30వ తేదీన ప్రెటోరియాలో గాంధీజీ జనరల్ స్మట్స్ తో మాట్లాడిన తరువాత ఆయనను అదేరోజు విడుదల చేశారు.

1908 అక్టోబర్ 7: దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఒప్పందాన్ని ఉల్లంఘించిందని గాంధీజీ రిజిస్ట్రేషన్ పత్రాలను తగులబెట్టారు. రిజిస్ట్రేషన్ పత్రాలను చూపించలేదన్న కారణంతో గాంధీజీని నాటాల్ నుంచి వస్తున్నప్పుడు అరెస్టు చేసి రెండుమాసాల కఠిన కారాగారశిక్ష విధించారు.

1909 ఫిబ్రవరి 25: రిజిస్ట్రేషన్ ధృవపత్రాన్ని చూపించలేదన్న కారణంతో గాంధీజీని మూడవసారి అరెస్టు చేశారు. మూడు మాసాల జైలు శిక్ష విధించారు. వోల్క్స్ రస్ట్(ట్రాన్స్ వాల్) కారాగారంలో ఆయనను నిర్బంధించారు.

1913 నవంబర్ 6: బోథా, స్మట్స్ హామీల ఉల్లంఘన పట్ల నిరసన తెలుపడానికి గాంధీజీ నాయకత్వాన ఒక పెద్ద ఊరేగింపు జరిగింది. ట్రాన్స్ వాల్ కు 8 మైళ్ళ దూరాన గాంధీజీని అరెస్టు చేశారు. కాలెన్ బాష్ పూచీపై గాంధీజీని విడుదల చేశారు.

1913 నవంబర్ 7: స్టాండర్ టన్ లో గాంధీజీని అరెస్టు చేసి బెయిల్ మీద విడుదల చేశారు.

1913 నవంబర్ 9: ఒక పెద్ద ఊరేగింపుకు పోలాక్ తో కలిసి నాయకత్వం వహిస్తూ గాంధీజీ ట్రాన్స్ వాల్ వైపు నడచివెళ్తున్నప్పుడు టీక్ వర్త్ లో ఆయనను అరెస్టు చేశారు. గాంధీజీకి తొమ్మిది మాసాల కారాగార శిక్ష విధించారు. విచారణ జరుపడానికి నవంబర్ 14వ తేదీన గాంధీజీని వోల్క్స్ రస్ట్ కు తీసుకవచ్చారు. చట్టాన్ని ఉల్లంఘించానని గాంధీజీ అంగీకరించారు. ఆయనకు మరో మూడుమాసాల కారాగార శిక్ష విధించారు. ఇది దక్షిణాఫ్రికాలో గాంధీజీకి చివరి శిక్ష. గాంధీజీని డిసెంబర్ 18వ తేదీన ప్రెటోరియాలో విడుదల చేశారు.

## భారతదేశంలో :

1917 ఏప్రిల్ 16: చంపారన్(బీహార్)నుంచి వెంటనే వెళ్లిపోవాలని జిల్లా పోలీసు అధికారి (ఎస్.పి.)మోతిహరిలో గాంధీజీకి అధికారికంగా ఒక నోటీసు ఇచ్చారు. ప్రభుత్వ ఆదేశాన్ని ధిక్కరిస్తున్నానని గాంధీజీ ఆ నోటీసు మీద రాశారు. ఆదేశాన్ని ఉల్లంఘించానని గాంధీజీ కోర్టులో చెప్పారు. బెయిల్ లేకుండానే గాంధీజీని విడుదల చేసారు. తరువాత గాంధీజీకి వ్యతిరేకంగా కేసును ఉపసంహరించింది ప్రభుత్వం. గాంధీజీ శాసనోల్లంఘన విధానానికి ఇది భారతదేశంలో ప్రథమ విజయం.

1919 ఏప్రిల్ 10: ఢిల్లీ వెళ్తున్న గాంధీజీని పాల్వాల్ స్టేషనులో అరెస్టు చేసి బొంబాయి తీసుకువెళ్ళారు. మరునాడు ఏప్రిల్ 11వ తేదీన గాంధీజీని విడుదల చేశారు.

1922 మార్చి 10: గాంధీజీ కారులో వెళ్తుండగా సబర్మతి ఆశ్రమం వద్ద రాత్రిపూట పదిన్నర గంటలకు అరెస్టు చేశారు. సబర్మతి జైలులో ఆయనను నిర్బంధించారు. యంగ్ ఇండియా పత్రికలో 1921 సెప్టెంబర్ 27వ తేదీన, 1921 డిసెంబర్ 15వ తేదీ, 1922 ఫిబ్రవరి 22వ తేదీన రాసిన వ్యాసాలతో గాంధీజీ దేశద్రోహం చేసారని ప్రాసిక్యూషన్ ఆరోపించింది. మూడు వ్యాసాలను తాను రాసినట్లు గాంధీజీ న్యాయస్థానంలో అంగీకరించారు. న్యాయమూర్తి బ్రూమ్ ఫీల్డ్ గాంధీజీకి

ఆరు సంవత్సరాల కారాగార శిక్ష విధించాడు. 1924 ఫిబ్రవరి 5వ తేదీన ససూన్ హాస్పిటల్లో శస్త్ర చికిత్స జరిగిన తరువాత గాంధీజీని ఎరవాడ జైలు నుంచి విడుదల చేశారు.

1929 మార్చి 4: కలకత్తాలో పోలీస్ కమిషనర్ ఆదేశాన్ని ధిక్కరించి మిర్జాపూర్ పార్క్ లో విదేశీ వస్త్రాల దహనం జరిపినందుకు గాంధీజీని అరెస్టు చేశారు. అదే రోజు రాత్రి బెయిల్ పై ఆయనను విడుదల చేశారు. మరునాడు ఉదయమే గాంధీజీ బర్మా పర్యటనకు బయలుదేరారు.

1930 మే 4, 5: 1930 మార్చి 5వ తేదీన గాంధీజీ ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించిన దండి సమీపాన కరాడి గ్రామంలో ఆయనను 1930 మే 4వ తేదీన అరెస్టు చేసారు. ఆయనను ఎరవాడ జైలులో నిర్బంధించారు. విచారణ జరుపలేదు, న్యాయస్థానం శిక్ష విధించలేదు. 1931 జనవరి 26వ తేదీన బేషరతుగా గాంధీజీ విడుదల జరిగింది.

1932 జనవరి 4: ఇంగ్లండు నుంచి తిరిగి రాగానే బొంబాయిలో రాత్రిపూట గాంధీజీని అరెస్టు చేశారు. ఎరవాడ జైలులో నిర్బంధించారు. 1932 సెప్టెంబర్ 20 రాత్రి ఆయనను బేషరతుగా విడుదల చేశారు. తరువాత గాంధీజీ 21 రోజుల నిరాహార దీక్ష ప్రారంభించారు.

1933 జూలై 31, ఆగస్టు 1: తన అనుచరులతో కలిసి రాస్ వైపు వెళ్తున్న గాంధీజీని బొంబాయిలో నడిరాత్రి అరెస్టు చేశారు.

1933 ఆగస్టు 4: గాంధీజీని విడుదల చేసి, ఎరవాడ నుండి వెళ్ళిపోవాలని, పూనాలో ఉండాలని ప్రభుత్వం ఆంక్ష విధించింది. ఈ ఆంక్షను గాంధీజీ ఉల్లంఘించారు. ప్రభుత్వం అదేరోజు గాంధీజీని తిరిగి అరెస్టు చేసి ఒక సంవత్సరం కారాగార శిక్ష విధించింది. 1933 ఆగస్టు 16వ తేదీన ప్రారంభించిన నిరాహార దీక్షతో గాంధీజీ ఆరోగ్యం క్షీణించింది. 1933 ఆగస్టు 23వ తేదీన ప్రభుత్వం బేషరతుగా గాంధీజీని విడుదల చేసింది.

1942 ఆగస్టు 9: బొంబాయి నగరంలో క్విట్ ఇండియా తీర్మానం చేసిన తరువాత ఆగస్టు 9 ఉదయం భారత రక్షణ నిబంధనల క్రింద ప్రభుత్వం గాంధీజీని అరెస్టు చేసి పూనాలోని ఆగాఖాన్ పాలెస్ లో నిర్బంధించింది. 1944 మే నెల 6వ తేదీ ఉదయం 8 గంటలకు ప్రభుత్వం గాంధీజీని బేషరతుగా విడుదల చేసింది.

**గాంధీమహాత్ముని జీవితంలో ఘనఘట్టాలు:**

1869 అక్టోబర్ 2: పశ్చిమ భారతదేశంలో, గుజరాత్లో, కథియావాడ్ లో, సముద్రతీరంలోని పోర్ బందరు పట్టణంలో మోహన్ దాస్ కరమ్ చంద్ గాంధీ జననం. కరమ్ చంద్ గాంధీ, పుత్లీబాయి దంపతుల నలుగురు సంతానంలో అందరి కంటె చిన్నవాడు మోహన్ దాస్ కరమ్ చంద్ గాంధీ(తరువాత గాంధీ మహాత్ముడు, బాపూజీ, గాంధీజీ).

1883: మే నెలలో కస్తూర్బా నఖన్ జీతో పదమూడవ ఏట వివాహం. ఇద్దరి వయసు ఒకటే!

1887: మెట్రిక్యులేషన్ లో ఉత్తీర్ణుడయి కాలేజ్ లో ప్రవేశం

1888 సెప్టెంబర్ 4: న్యాయశాస్త్రం చదువడానికి బొంబాయి నుంచి ఇంగ్లండు ప్రయాణం.

1889-91: లండన్లో భగవద్గీత పఠనం-ఇతర మతగ్రంథాల పఠనంబీ ఆస్తిక ప్రముఖులతో పరిచయంబీ వెజిటేరియన్ సొసైటీలో సభ్యత్వంబీ సొసైటీ మాసపత్రికకు వ్యాసాలు రాయడం. లండన్ డైరీ రాయడంబీ లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణత.

1891 జూన్ 10: న్యాయవాదిగా కోర్టులో ప్రవేశం

జూన్ 12: భారతదేశానికి సముద్ర మార్గాన ప్రయాణం

1891-93: రాజ్ కోట్ లో, బొంబాయిలో న్యాయవాద వృత్తి

1893 ఏప్రిల్: అబ్దుల్లా కంపెనీ కేసులలో న్యాయవాదిగా సహాయ పడడానికి దక్షిణాఫ్రికాకు ప్రయాణం

1894 ఆగష్టు 22 నుంచి: నాటాల్ ఇండియన్ కాంగ్రెస్ స్థాపన. బైబిల్, ఖురాన్, జరతృష్ట, మాక్స్ ముల్లర్ రచించిన 'భారతదేశం మనకు ఏం బోధించగలుగుతుంది' గ్రంథం, ఉపనిషత్తులు, టాల్ స్టాయ్ రచించిన 'ది కింగ్ డమ్ ఆఫ్ గాడ్ ఈజ్ విథిన్ యు' గ్రంథం తదితర అధ్యాత్మిక గ్రంథాల పఠనం.

1895: "ది ఇండియన్ ఫ్రాంచయిజ్: ఆన్ అప్పీల్ టు ఎవ్రీ బ్రిటన్ ఇన్ సౌత్ ఆఫ్రికా" ప్రకటన విడుదల

1896 జూలై: భారతదేశానికి రాక. దక్షిణాఫ్రికాలోని భారతీయుల పరిస్థితిపై

ఒక చిన్న పుస్తకం ప్రచురణ. ఈ పుస్తకం 'గ్రీన్ పామ్ ఫ్లెట్' గా ప్రచారం పొందింది.

1897: దక్షిణాఫ్రికాకు తిరిగి రాక

1900: దక్షిణాఫ్రికాలోని భారతీయుల పరిస్థితులపై ఒక ముసాయిదా తీర్మానం(భారత జాతీయ కాంగ్రెస్ కోసం)రాసి దాదాభాయి నౌరోజీకి పంపించడం

1901 డిసెంబర్: భారతదేశానికి తిరిగి వచ్చి, కలకత్తాలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలో తన తీర్మానాన్ని ప్రవేశపెట్టడం

1902: భారతదేశంలో ఒక యాత్రికుడుగా విస్తృత పర్యటన. బొంబాయిలో న్యాయవాద వృత్తి

1902 నవంబర్: ఆసియా వాసులకు వ్యతిరేకంగా దక్షిణాఫ్రికా శ్వేతజాతి ప్రభుత్వం రూపొందించిన చట్టాన్ని ప్రతిఘటించడానికి వెంటనే రావాలని పిలుపు. తక్షణమే దక్షిణాఫ్రికాకు ప్రయాణం

1903: ట్రాన్స్ వాల్ సుప్రీంకోర్టులో అటార్నీగా నమోదు

1903 జూన్: ఇంగ్లీషు, గుజరాతీ భాషల 'ఇండియన్ ఒపినియన్' వారపత్రికకు సంపాదకత్వం

1904: రస్కిన్ రాసిన UNTO THIS LAST గ్రంథాన్ని గాంధీజీ చదివి ఎంతో ప్రభావితులయినారు. దర్బాన్ సమీపంలో గాంధీజీ ఫోనిక్స్ సెటల్మెంట్ ఆశ్రమాన్ని స్థాపించారు. అది ఆయన మొదటి ఆశ్రమం. మధుమేహం(డయాబెటిస్)వ్యాధి మీద గాంధీజీ గుజరాతీ భాషలో అనేక వ్యాసాలు రాసారు. వాటిని ఇంగ్లీషు భాషలోనికి అనువదించి 'ఆరోగ్య మార్గదర్శిని' పేరుతో గ్రంథంగా ప్రచురించారు. ఇండియన్ ఒపినియన్ పత్రిక కార్యాలయాన్ని, ముద్రణాలయాన్ని ఫోనిక్స్ ఆశ్రమానికి తరలించారు.

1907: 'నీతి ధర్మ' (నైతికమతం) అంశంపై వరుసగా ఎనిమిది వ్యాసాలు గుజరాతి భాషలో రచించి మొదట 'ఇండియన్ ఒపినియన్' పత్రికలో ప్రచురించారు తరువాత ఈ వ్యాసాలతో ఒక పుస్తకం ప్రచురితమయింది.

రెవరెండ్ జె.జె.డోక్ పలు పర్యాయాలు గాంధీజీతో ఇంటర్వ్యూ జరిపి 'ఎమ్.కె.గాంధీ–దక్షిణ ఆఫ్రికాలో భారతీయ దేశభక్తుడు' అన్న గ్రంథం రచించారు.

1908 జనవరి 10: 'సత్యాగ్రహ' పదాన్ని గాంధీజీ ప్రథమ పర్యాయం ఉపయోగించారు–ఇంగ్లీషు PASSIVE RESISTANCE పదాలకు బదులు.

1909: ఇంగ్లండుకు ప్రయాణం. టాల్ స్టాయ్ కు మొదటి లేఖ రాసారు–దానికి జవాబు లేఖ వచ్చింది. తిరుగు ప్రయాణంలో 'హింద్ స్వరాజ్' లేక INDIAN HOME RULE అన్న పుస్తకం రచించారు.

1909 నవంబర్ 10: టాల్‌స్టాయ్ కు మరో లేఖ. రెవరెండ్ డోక్ రాసిన పుస్తకాన్ని టాల్‌స్టాయ్ కు పంపించారు.

1910 ఏప్రిల్ 4: 'ఇండియన్ హోమ్‌రూల్' పుస్తకాన్ని టాల్‌స్టాయ్ కు పంపించారు.

1910 మే 8: సకల మానవాళికి ఎంతో విలువయినది PASSIVE RESISTANCE (సత్యాగ్రహం) అని టాల్‌స్టాయ్ సమాధానం ఇచ్చారు. జోహన్స్ బర్గ్ కు 21 మైళ్ల దూరంలో టాల్ స్టాయ్ క్షేత్రాన్ని గాంధీజీ నెలకొల్పారు. మత విషయాలలో శిక్షణ, శారీరక శ్రమ ఈ క్షేత్రం ప్రధాన లక్ష్యాలు. ఈ క్షేత్రంలో శిక్షణ పొందిన వారు సత్యాగ్రహ సమరానికి సిద్ధమయినారు.

1913 నవంబర్: దక్షిణ ఆఫ్రికాకు వచ్చిన సి.ఎఫ్.ఆండ్రూస్ తో గాంధీజీ ప్రథమ సమావేశం.

1914: టాల్‌స్టాయ్ క్షేత్రాన్ని మూసివేసారు. ఫోనిక్స్ అన్ని కార్యక్రమాలకు కేంద్రమయింది. సత్యాగ్రహ సమరం విజయవంతం కావడంతో గాంధీజీ భారతదేశం వెళ్లాలని నిర్ణయించారు. ముందు ఇంగ్లండు వెళ్లారు ఆయన. అప్పుడు లండన్ లో ఉన్న సరోజనీనాయుడును కలిసి మాట్లాడారు గాంధీజీ.

1915 జనవరి: శాశ్వతంగా భారతదేశానికి తిరిగి వచ్చారు.

ఫిబ్రవరి: శాంతినికేతన్ కు వెళ్లారు. రవీంద్రనాథ్ టాగోర్ ఘనస్వాగతం ఇచ్చారు.

మే 20: అహమదాబాద్ సమీపంలోని ఒక గ్రామంలో సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించారు.

1915–16: భారతదేశంలో, బర్మాలో విస్తృత పర్యటనలు. గాంధీజీ రైలులో మూడవ తరగతిలో ప్రయాణించారు.

1917: సత్యాగ్రహ ఆశ్రమాన్ని సబర్మతి తీరంలోని కొత్తస్థలానికి మార్చారు.

1919 సెప్టెంబర్: గుజరాతి మాసపత్రిక 'నవజీవన్' సంపాదకులయి దానిని వారపత్రికగా మార్చారు గాంధీజీ.

అక్టోబర్: ఇంగ్లీషు వారపత్రిక 'యంగ్ ఇండియా' సంపాదకులయినారు.

1920: అహమదాబాద్ లో గుజరాత్ విద్యాపీఠ్(గుజరాత్ జాతీయ విశ్వవిద్యాలయం)ను స్థాపించారు.

1921: కలకత్తా, పాట్నా తదితర నగరాలలో జాతీయ కళాశాలలను నెలకొల్పారు. మొహమ్మద్ అలీ సహాయంతో జామియామిల్లియా ఇస్లామియాను(ముస్లిమ్ జాతీయ విశ్వవిద్యాలయాన్ని)స్థాపించారు.

1922: 'యాంగ్ ఇండియా' పత్రికలో మూడు వ్యాసాలు రాసినందుకు 'దేశద్రోహం' ఆరోపణతో గాంధీజీని మార్చి 10వ తేదీన అరెస్టు చేసి, అహమదాబాద్ కోర్టులో మార్చి 18వ తేదీన విచారణ జరిపి ఆరు సంవత్సరాల కారాగార శిక్ష విధించారు. ఈ కేసు విచారణలో గాంధీజీ చేసిన ప్రకటన చరిత్రాత్మకమయినది.

1922-23: ఎరవాడ జైలులో గాంధీజీ 150 గ్రంథాలు చదివారు. ఇవి ప్రపంచ సాహిత్యంలో గణనీయగ్రంథాలు.

1924 జనవరి-ఫిబ్రవరి: అపెండిసైటిస్ కారణంగా గాంధీజీకి శస్త్రచికిత్స జరిపి ఫిబ్రవరి 5వ తేదీన జైలు నుంచి విడుదల చేసారు.

1924 మార్చి 22: ఫ్రెంచి మేధావి రోమరోలాకు గాంధీజీ నుంచి మొదటి లేఖ-పరిచయ ప్రారంభం. రోమరోలా రచించిన గాంధీజీ జీవితచరిత్ర గ్రంథం ప్రచురితమయింది. మిస్ మాడలైన్ స్లేడ్ ఈ గ్రంథం చదివి గాంధేయ సిద్ధాంతాలచే ప్రభావితులయినారు-భారతదేశం వెళ్లి భారతదేశానికి అంకితం కావడానికి ఆమె నిర్ణయించారు.

1924 ఏప్రిల్: తిరిగి యంగ్ ఇండియా, నవజీవన్ పత్రికలకు సంపాదకత్వం.

1925 మే 29: శాంతినికేతన్ లో రవీంద్రనాథ్ టాగోర్ తో సమావేశం.

1925 నవంబర్: ఆత్మకథ రచన ప్రారంభం.

1929 డిసెంబర్ 31: రావీ నదీ తీరాన లాహెూర్ లో జవహర్లాల్ నెహ్రూ అధ్యక్షతన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలో, గాంధీజీ నేతృత్వంలో సంపూర్ణ స్వరాజ్ తీర్మానం.

1930 జనవరి 26: దేశమంతట స్వాతంత్ర్య సాధన ప్రతిజ్ఞ.

మార్చి 12: శాసనోల్లంఘన ఉద్యమంలో భాగంగా సబర్మతి ఆశ్రమం నుంచి 79 మంది ఆశ్రమ వాసులతో కలిసి దండి ఉప్పు సత్యాగ్రహ యాత్ర ప్రారంభం.

ఏప్రిల్: నవజీవన్ పత్రిక ప్రెస్ పై పోలీసుల దాడిబీ ప్రెస్ మూసివేత. సైక్లోస్టయిల్ లో పత్రిక ప్రచురణ.

1931 ఆగస్టు 31: గాంధీజీ రూపొందించిన జాతీయ పతాకానికి స్వల్ప మార్పులతో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆమోదం. ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ రంగులతో జాతీయపతాకం. మధ్య తెలుపు రంగులో చరఖా.

సెప్టెంబర్–డిసెంబర్: రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో పాల్గొనడానికి లండన్ లో, పలు సాంస్కృతిక కార్యక్రమాలు. ఈటన్ కాలేజీలో, లండన్ స్కూల్ అఫ్ ఇకనామిక్స్ లో ప్రసంగాలు–కేంబ్రిడ్జ్, ఆక్స్ ఫర్డ్ విశ్వవిద్యాలయాలకు గాంధీజీతో మాట్లాడడానికి జార్జ్ బెర్నాడ్ షా, చార్లీచాప్లిన్, హెరాల్డ్ లస్కీ తదితర ప్రముఖ మేధావులు, రచయితలు గాంధీజీ వద్దకు వచ్చి మాట్లాడారు, చర్చలు జరిపారు. గాంధీజీ బ్రిటిష్ ప్రముఖ రాజకీయవేత్త లాయడ్ జార్జ్ ను, కాంటర్ బరీ ఆర్చి బిషప్ ను కలిసి మాట్లాడినారు.

రేడియోలో ప్రసంగిస్తూ గాంధీజీ అమెరికా(యు.ఎస్.ఏ.)ప్రజలకు సందేశం ఇచ్చారు. అది గాంధీజీ మొదటి రేడియో ప్రసంగం. లండన్లో గాంధీజీ ఉంటున్న కింగ్ స్లే హాలులో అక్టోబర్ 2వ తేదీన ఆయన పుట్టినరోజు వేడుక జరిగింది.

1931 డిసెంబర్ 5: ఇంగ్లండు నుంచి స్వదేశం బయలుదేరి గాంధీజీ ఒకరోజు పారిస్ లో గడిపారు–ఒక సమావేశంలో ప్రసంగించారు. అయిదు రోజులు విల్లెన్యూలో రోమరోలాతో ఉన్నారు. జనీవాలో, లాసన్ లో బహిరంగ సభలలో ప్రసంగించారు. రోమ్ నగరంలో టాల్ స్టాయ్ పుత్రిక గాంధీజీ వద్దకు వచ్చి మాట్లాడారు. గాంధీజీ వాటికన్ మ్యూజియంకు, లైబ్రరీకి వెళ్లారు.

డిసెంబర్ 24: బ్రిండిసి నుంచి స్వదేశం బయలుదేరారు.

డిసెంబర్ 28: బొంబాయి చేరారు.

1932 జనవరి 4: బొంబాయిలో గాంధీజీని అరెస్టు చేసి ఎరవాడ సెంట్రల్ జైలుకు తీసుకెళ్లారు.

సెప్టెంబర్ 20: దళిత వర్గాలకు వేరు ఎలెక్టోరేట్లు కల్పించడానికి బ్రిటిష్ ప్రధానమంత్రి రామ్సే మక్ డొనాల్డ్ ప్రకటించిన కమ్యూనల్ అవార్డుకు వ్యతిరేకంగా నిరసన తెలుపడానికి గాంధీజీ ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు.

సెప్టెంబర్ 26: ఎరవాడ ఒప్పందంపై సంతకాలు జరుగడంతో గాంధీజీ ఆమరణ నిరాహార దీక్ష విరమించారు. గాంధీజీని చూడడానికి రవీంద్రనాథ్ టాగోర్ ఎరవాడ జైలుకు వచ్చారు.

1933: హరిజన్ సేవక్ సంఘ్ స్థాపన జరిగింది. 'హరిజన్' వారపత్రిక ప్రచురణ ప్రారంభమయింది.

మే 8: తన, తన అనుచరుల ఆత్మశుద్ధికోసం గాంధీజీ 21 రోజుల నిరాహారదీక్ష ప్రారంభించారు.

అదే రోజు జైలు నుంచి విడుదల. పూనాలోని 'పర్ణకుటి'లో నిరాహారదీక్ష విరమణ.

1934: తన మార్గదర్శకత్వంలో ఒక రాజకీయేతర సంస్థగా పని చేయడానికి అఖిల భారత గ్రామీణ పరిశ్రమల సంఘాన్ని స్థాపించి ప్రారంభించారు.

1935: ఇందోర్ లో హిందీ సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షత. వార్ధా సమీపంలో సెగావ్ లో గాంధీజీ నివసించడానికి మీరా బహెన్ ఒక చిన్న కుటీరాన్ని నిర్మించారు.

1936: జపాన్ కవీశ్వరుడు యోనెనొగుషి భారతదేశం వచ్చి గాంధీజీ దర్శనం కోసం వార్ధా వెళ్లారు. తరువాత మరో జపాన్ ప్రముఖుడు డాక్టర్ టొమికాకొరా వార్ధాలో గాంధీజీని కలిసి మాట్లాడారు. వారు గాంధీజీని జపాన్ కు ఆహ్వానించారు. కుటుంబ నియంత్రణ ఉద్యమ నాయకురాలు మార్గరెట్ సాంగర్ వార్ధాలో గాంధీజీని కలిసి చర్చలు జరిపారు. నీగ్రో ప్రతినిధి వర్గం ఒకటి బార్డోలీలో గాంధీజీతో చర్చలు జరిపింది. నాగపూర్ లో అఖిల భారత సాహిత్య సభకు గాంధీజీ అధ్యక్షత వహించారుబీ అహమదాబాద్ లో గుజరాతీ సాహిత్య సభకు ఆయన అధ్యక్షత వహించారు. జాతీయ విద్యామహాసభలో ఆయన ప్రసంగించారు.

1937: మద్రాసులో హిందీ సాహిత్య సమ్మేళన్ లో గాంధీజీ ప్రసంగించారు. కలకత్తాలో సుభాష్ చంద్రబోస్ నివాసంలో ఉంటున్నప్పుడు గాంధీజీని చూడడానికి రవీంద్రనాథ్ టాగోర్ వచ్చారు.

1938: వార్ధా సమీపంలోని సెగావ్ లో గాంధీజీతో మూడు రోజులు చర్చలు జరిపాడు లార్డ్ లోథియన్.

పది సంవత్సరాల నుంచి గాంధీజీతో సన్నిహితంగా ఉంటున్న యూరపు, అమెరికా, జపాన్ మేధావులెందరో సెగావ్ వచ్చి గాంధీజీతో చర్చలు జరిపారు. వీరందరి రాకతో చిన్నగ్రామం సెగావ్ అంతర్జాతీయ దృష్టిని ఆకర్షించింది.

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ సంపాదకత్వాన ఒక ప్రత్యేక అభినందన సంచిక "మహాత్మాగాంధీ" గాంధీజీ 70వ జయంతి సందర్భాన ప్రచురితమయింది.

1939 మార్చి 5: సెగావ్ పేరును సేవాగ్రామ్ (సేవలందించే గ్రామం) గా మార్చారు. గాంధీజీ, కస్తూర్బా శాంతినికేతన్ వెళ్లారు. జీవిత సాయంకాలంలో ప్రవేశించిన రవీంద్రనాథ్ టాగోర్ వీరిద్దరి రాకతో చాల సంతోషించారు. శాంతినికేతన్ మామిడి తోటలో ఒక ఉత్సవం జరిగింది. విశ్వభారతిని గాంధీజీ తన పరిరక్షణలోనికి తీసుకోవాలని ఆ ఉత్సవంలో టాగోర్ అభ్యర్థించారు. విశ్వభారతికి గాంధీజీ శాశ్వతస్థాయి కల్పించాలని టాగోర్ కోరారు.

ఏప్రిల్ 5: గాంధీజీ ప్రియమిత్రుడు–ఆంగ్లేయ విద్యావేత్త–సి.ఎఫ్.ఆండ్రూస్ కలకత్తాలో మరణించారు.

సత్యాగ్రహంపై రచనలన్నిటిని ప్రచురణకు ముందే సెన్సారింగ్ కు ఇవ్వాలని ప్రభుత్వం డిమాండ్ చేయడంతో గాంధీజీ 'హరిజన్' తదితర వారపత్రికలన్నిటి ప్రచురణను నిలిపివేసారు.

1941 ఆగస్టు 7: విశ్వకవి రవీంద్రనాథ్ టాగోర్–గాంధీజీకి అత్యంత సన్నిహితుడు–కలకత్తాలో అస్తమించారు.

1942 జనవరి 18: గాంధీజీ, పదిహేను మాసాల నిలిపివేత పిదప, హరిజన్ తదితర వారపత్రికల ప్రచురణను తిరిగి ప్రారంభించారు.

ఆగస్టు 8: అఖిలభారత కాంగ్రెస్ కమిటీ(ఏ.ఐ.సి.సి.)బొంబాయిలో సమావేశమయి 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని ఆమోదించింది.

ఆగస్టు 9: గాంధీజీని అరెస్టు చేసి(గాంధీజీతో పాటు ఆయన సతీమణి కస్తూర్బాను గూడ అరెస్టు చేసి)పూనాలోని ఆగాఖాన్ భవన్ లో ఇద్దరినీ నిర్బంధించారు.

1943 ఫిబ్రవరి 10: నిర్బంధంలో గాంధీజీ మూడు వారాల నిరాహారదీక్ష ప్రారంభించారు.

మార్చి 3: మూడు వారాలు కాగానె గాంధీజీకి ఎంతో ఇష్టమయిన "వైష్ణవ జనతో..." గీతాలాపన చేస్తుండగా, సరోజనీనాయుడు టాగోరు గీతాంజలి గీతాలను చదువుతుండగా గాంధీజీ నిరాహారదీక్ష ముగిసింది.

మే 6: గాంధీజీ విడుదల.

1944 ఫిబ్రవరి 22: అనారోగ్యంతో బాధపడుతూ డెబ్బయినాలుగవ ఏట కస్తూర్బా మృతి

ఆగస్టు 8: సేవాగ్రామ్ లో రవీంద్రనాథ్ టాగోర్ మూడవ వర్ధంతి.

1945 డిసెంబర్ 19: శాంతినికేతన్ లో సి.ఎఫ్.ఆండ్రూస్ స్మారక ఆసుపత్రికి శంకుస్థాపన.

1946 జనవరి 18: హరిజన్ తదితర వారపత్రికల పునరుద్ధరణ.

నవంబర్: నౌఖాలియాత్ర ప్రారంభం.

1947 ఏప్రిల్ 1-2: ఢిల్లీలో ఆసియా సంబంధాల కాన్ఫరెన్సులో ప్రసంగం

జూలై: భారత స్వాతంత్ర్య ప్రధాన బిల్లుకు బ్రిటిష్ పార్లమెంటు ఆమోదముద్ర.

1947 ఆగస్టు 15: భారతదేశానికి స్వాతంత్ర్యం.

1948 జనవరి 30: ఢిల్లీలో, ప్రార్థనా సమావేశంలో, సాయంత్రం 5గంటలకు జాతిపిత గాంధీజీ దారుణ హత్య.

2007: గాంధీజీ పుట్టినరోజు అక్టోబర్ 2ను అంతర్జాతీయ అహింసాదినంగా ప్రకటిస్తూ ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ తీర్మానం.

2018-19: గాంధీజీ 150 వ జయంతి ఉత్సవాలు.





# యువభారతి

## (సాహితీ సాంస్కృతిక సంస్థ)

సారస్వత పరిషత్ భవనం, తిలక్‌రోడ్, హైద్రాబాద్ - 1

### అందుబాటులో ఉన్న కొన్ని మా ప్రచురణలు

| క్రమ సంఖ్య | ప్రచురణ సంఖ్య | పుస్తకం పేరు | వెల. రూ. |
|---|---|---|---|
| 1. | 6 | కావ్య లహరి (పునర్ముద్రణ) ఆచార్య దివాకర్ల వేంకటావధాని ప్రసంగ వ్యాసాలు | 160/- |
| 2. | 19 | ప్రజాసూక్తం (తెలుగు సామెతల సంకలనం) | 50/- |
| 3. | 29 | భావన (సుభాషితాల సంకలనం) | 50/- |
| 4. | 100 | సంస్కృత సాహితీలహరి (ఆరు సంస్కృత నాటకాలపై ఉపన్యాసవ్యాసాలు) | 20/- |
| 5. | 121 | నవ్య సాహితీలహరి (నవల, కథానిక, వ్యాసం, నాటిక వంటి ఆధునిక ప్రక్రియలపై ప్రసిద్ధుల ప్రసంగవ్యాసాలు) | 20/- |
| 6. | 127 | యువత (యువతరం సమస్యలపై నిర్వహించిన గోష్ఠి కొరకై ప్రసిద్ధ రచయితలు రాసిన వ్యాసాలు) | 25/- |
| 7. | 160 | విశ్వనాథ సాహితీ సమాలోచనం (విశ్వనాథ శతజయంతి సాహితీవ్యాసాలు) | 100/- |
| 8. | 176 | వేదవిజ్ఞానలహరి (వేదాలలోని సామాజిక, విజ్ఞాన శాస్త్రాలపై విద్వన్మణుల ఉపన్యాసవ్యాసమంజరి) | 100/- |
| 9. | 178 | ఉపనిషత్ సుధాలహరి (దశోపనిషత్తులపై విద్వన్మణుల ప్రసంగవ్యాసాలు) | 160/- |
| 10. | 179 | వ్యక్తిత్వ వికాసం (సూత్రాలు సూక్తులు) | 50/- |
| 11. | 191 | అమరుడు బాపూజీ : దేవులపల్లి ప్రభాకరరావు | 50/- |
| 12. | 192 | నాటక పద్యాలు : విహారి | 50/- |

**వివరాలకు సంప్రదించండి :**

ఆచార్య ఫణీంద్ర
(అధ్యక్షులు)
99598 82963

జీడిగుంట వెంకటరావు
(కార్యదర్శి)
93913 73684

ఆమాతి రవీంద్ర
(కోశాధికారి)
98499 09896